# జెమ్స్‌తో బలే మజా

**అదృష్టవంతులు గెలుపొందేందుకు 500 బహుమతులు**

అంతేగాక, అదనంగా భారీ బహుమతులను
గెలుచుకునే సదవకాశం!

వీటిలో ఏ అంకె లేదో చెప్పుకోండి చూద్దాం













...పడండి!

మీ జవాబుతోపాటు
క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఖాళీ ప్లాస్టిక్
పాకెట్ ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు
...రి 500 మంది విజేతలకు రూ.11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక
... అంటే మీ ఆ కానుక చెక్ ద్వారా మరో భారీ బహుమతి—
...ందే అవకాశం కూడా ఉంటుందన్నమాట—అదృష్టవంతులకు
మరి!

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా
ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి.
మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.
"Fun with Gems" Dept. B- 22
Post Box No. 56. Thane 400 601.
ఎంట్రీలు గ్రహించబడేందుకు ఆఖరు తేది:
ఆగస్టు 16, 1976

**...లోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

CHAITRA-C-39 TEL

మూత్తయిదువులు వచ్చారంటే పసుపు,కుంకుమ తెస్తారు
ముగ్గురు మూర్ఖులు వచ్చారంటే ముచ్చటలెన్నో చెబుతారు

తప్పక చూడండి






# ముగ్గురు మూర్ఖులు

దర్శకత్వం: కె.హేమాంబరధరరావు

రచయిత-నిర్మాత: మహేష్

ఆంధ్ర: విజయకంబైన్స్. సీడెడ్: జయలక్ష్మీ పిక్చర్స్. నైజాం: గీతాఫిలింస్ (శ్రీ

VIJAYA

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["మణి చేసిన పరిణయం]" వీరేపల్లి జయరాంరెడ్డి రచన. పరిస్థితుల ప్రభావానికి లోబడి తన లక్ష్యాన్ని మరిచేవాడు గౌరవనీయుడు కాదన్నది ఈ కథలోని నీతి.

మరొక కోణం నుంచి చూస్తే, పరిస్థితులు అనుకూలించనప్పుడు ఎంతటి మహిమగల ప్రయత్నం కూడా వ్యర్థమవుతుంది. ఈ నీతి ''వ్యర్థ ప్రయత్నం'' అన్న కథలో కనిపిస్తుంది. ఆ కథలో ప్రయత్నం వృథా కావటానికి తప్పు ఎవరిదీ కాదు!

సంపుటి 59 జూలై '76 సంచిక 1




CHITRA



# మిత్రసంప్రాప్తి

## 37

అప్పుడు తాబేలు కాకితో, "ఈ ఎలుక ఎవరు? నీకు సహజ ఆహారమైన ఈ ఎలుక నీ కడుపులో ఉండటానికి మారుగా నీ వీపు మీద ఎందుకు ఉన్నది? దాన్ని నువు ఎందుకు మోసుకువచ్చావు? ఇందుకు అసాధారణమైన కారణం ఏదో ఉండి ఉండాలి," అన్నది.

"ఈ ఎలుక పేరు హిరణ్యకం. నా ఆప్త మిత్రుడు. ఇతను ఏదో కష్టంలో ఉండి నీ కోసం వచ్చాడు. నే నడిగితే అదంతా పెద్దకథ లెమ్మన్నాడు. అందుచేత అదేమిటో నాకూ తెలియదు," అన్నది కాకి.

కాకీ, తాబేలూ కోరగా హిరణ్యకం (ఎలుక) తన కథ ఇలా చెప్పసాగింది:

దక్షిణ దేశంలో మహిళారూప్యమనే నగరం ఉన్నది. అక్కడ ఒక గొప్ప శివాలయం ఉన్నది. దాని సమీపంలోనే ఒక మఠం ఉన్నది. అందులోని ఒక గదిలో చూడాకర్ణుడు అనే ఒక సన్యాసి ఉండేవాడు. అతను రోజూ భిక్షా పాత్ర తీసుకుని నగరంలో భిక్షం ఎత్తేవాడు. నగరంలో అనేక మంది ధనికులు ఉండటం చేత అతనికి చక్కెరతోనూ, బెల్లంతోనూ చేసిన మిఠాయి వస్తువులూ, దానిమ్మ, మామిడి లాటి మంచి మంచి పళ్ళూ దొరికేవి. అందులో కొద్ది భాగం మాత్రమే తాను తిని, హెచ్చు భాగం భిక్షాపాత్రలో భద్రపరిచి, దాన్ని గోడకు ఉండే కొయ్య చిలుకకు తగిలించేవాడు.

రాత్రి వేళ నేనూ, నా అనుచరులూ వెళ్ళి, ఎగిరి భిక్షాపాత్రలోకి దూకి, రుచిగల ఆ ఆహారాన్ని తినేసేవాళ్ళం.

ఇంతలో ఒకనాడు ఆ సన్యాసి మిత్రుడొకడు, బృహస్పతి అనేవాడు చూడ

వచ్చాడు. ఆ మనిషి శరీరమూ, పొట్టా విపరీతంగా లావుగా ఉండేవి.

సన్యాసి చూడాకర్ణుడు బృహస్పతితో, "మిత్రమా, ఇన్నాళ్ళూ ఎక్కడెక్కడ తిరిగావు? ఏమేమి చూశావు?" అన్నాడు.

"ఎంతో కాలం క్రితం కార్తీక పౌర్ణమి నాడు పుష్కర తీర్థంలో నువూ, నేనూ స్నానం చేసిన సంగతి నీకు గుర్తు ఉంటుంది. ఆ జనసమ్మర్దంలో మనిద్దరమూ చీలిపోయి, ఒకరి నొకరం మరి కలుసుకోలేకపోయాం. అటు తరవాత నేను హరిద్వారమూ, ప్రయాగా, కాశీ మొదలైన తీర్థాలు సేవిస్తూ ఎన్నో వింతలు చూశాను," అంటూ ప్రారంభించి బృహస్పతి చెప్పుకుంటూ పోయేటప్పుడు నేను భిక్షాపాత్రలో ప్రవేశించి పదార్థాలు ఆరగిస్తుంటే, సన్యాసి నన్ను భయపెట్టటానికి తన కర్రతో భిక్షాపాత్ర మీద కొట్టసాగాడు.

ఇది చూసి బృహస్పతి విసుక్కుంటూ, "ఇదేమిటి, మిత్రమా? నన్ను చెప్పమని ఆ కర్రతో అలా చప్పుడు చేస్తావెందుకు? విసుగుపుట్టుతున్నదా?" అన్నాడు.

దానికి చూడాకర్ణుడు, "ఆగ్రహించకు, మిత్రమా! ఒక ఎలుక తన అనుచరులతో సహా వచ్చి, భిక్షాపాత్రలోకి దూకి, నేను దాచిన ఆహారమంతా తినేస్తున్నది," అన్నాడు.



"ఇక్కడ ఒక్క ఎలుకే ఉన్నదా? లేక చాలా ఉన్నాయా?" అని బృహస్పతి అడిగాడు.

"ఇతర ఎలుకలున్నాయిగాని, వాటిని నేను అంతగా పట్టించుకోను. ఇది వాటికి నాయకుడు. దానికి నే నంటే ఏమీ లక్ష్యం లేదు," అన్నాడు చూడాకర్ణుడు.

"దాని ధైర్యానికి బలమైన కారణం ఉండే ఉంటుంది. వెనకటికి బ్రాహ్మణి నువ్వుపప్పుకు ముడినువ్వులు మారకం తీసుకున్నదంటే దానికి కారణం ఉండనే ఉన్నది గదా!" అన్నాడు బృహస్పతి.

"ఏమిటా కథ?" అని చూడాకర్ణుడు అడిగాడు. బృహస్పతి ఇలా కథ చెప్పాడు :

## నువ్వుపప్పుకు ముడినువ్వులు

ఒక వానాకాలం నేను ఒక పట్టణంలో ఒక బ్రాహ్మణుణ్ణి అతని ఇంట వానలు వెళ్ళిపోయినదాకా ఉండనియ్యమన్నాను. బ్రాహ్మణుడు సరేనన్నాడు. ఒకనాడు ఆయన తన భార్యతో, "రేపు దక్షిణాయణ పుణ్యకాలం వస్తుంది. సంక్రమణానికి బ్రాహ్మణులను పిలిచి భోజనం పెడదాం," అన్నాడు.

ఆమె, "మనకే తినటానికి లేకపోతే బ్రాహ్మణుల కేం పెడదాం?" అన్నది.

"అలా అనకు. పేదవాళ్ళు కూడా ఉన్నంతలో అర్హులకు పెట్టాలి. పొదుపుగా ఉండటం తప్పులేదు గాని దురాశ పనికి రాదు. దురాశతోనే గదా నక్క ప్రాణాలు తీసుకున్నది?" అన్నాడు భర్త.

"ఏమిటా కథ?" అని భార్య అడిగింది. భర్త ఇలా చెప్పాడు:

### దురాశగల నక్క

ఒకనాటి ఉదయం ఒక వేటగాడు అరణ్యంలో ఒక అడవిపందిని బాణంతో కొట్టాడు. అది ఆ దెబ్బకు వెంటనే చావక వేటగాడి మీదికి వచ్చి, వాణ్ణి పడదోసి, వాడి పొట్ట చీల్చి చంపేసింది. కాని కొద్ది క్షణాలకు అది కూడా, రక్తం కోల్పోయి, వేటగాడి పక్కనే చచ్చిపడింది.

ఇది జరిగిన కొద్ది సేపటికి ఒక నక్క అటుగా వచ్చి, "ఆహా, ఏమి నా అదృష్టం! ఈ శవాలను సాధ్యమైనంత హెచ్చు కాలం తింటాను. ఈ పూటకు ఈ విల్లుకు కట్టిన అల్లెతాడూ, కట్టుతాళ్ళూ (తోలువి) తింటే కడుపునిండుతుంది," అనుకున్నది.

అది మెల్లిగా నేల మీది నుంచి విల్లును ఎత్తి, ఒక చివర ఉన్న కట్టుతాళ్ళు కొరుకుతూ, "ఉట్టుడియంగా దొరికిన సొత్తు నైనా మందులాగా పొదుపుగా వాడాలి గాని, దుబారా చెయ్యరాదు," అనుకున్నది.

కాని అది కట్టుతాడు కొరికేసిన మరుక్షణం విల్లు తన్ని, దాని అంగుడులో నుంచి, తలలోకి దిగబడి ఆ నక్క కాస్తా అక్కడే చచ్చింది.





# మాయాసరోవరం

## 7

[ ఊడలమర్రి దగ్గిర జయశీలుడికి, సిద్ధసాధకుడికి ఒక పురాతన తాళపత్ర గ్రంథం దొరికింది కాని, రాజుగారి పిల్లల జాడలుమాత్రం తెలియలేదు. వాళ్లు దాపులనున్న కొండల కేసి బయలు దేరారు. ఆ సమయంలో, ఆ ప్రాంతాల గల ఒక గ్రామప్రజలు తమ జొన్నచేల కేసి పోగా, వాళ్ళ మీదికి ఒక వికృతాకారుడు, తానెక్కి వున్న ఏనుగును ఉసికొల్పాడు. తరవాత—]

తమ కేసి వస్తున్న ఏనుగునూ, దాని మీద మొసలిరూపంలో వున్న వాణ్ణీ చూస్తూనే, గ్రామస్థులంతా భయకంపితులైపోయారు. ఒకటి రెండు క్షణాలపాటు వాళ్ళకు పారిపోయేందు కూడా కాళ్ళాడలేదు. ఏనుగు మీద వున్న వికృతాకారుడు, తన వాహనాన్ని వాళ్ళ దాపులకు పరిగెత్తించి, పెద్ద గొంతుతో, ''మీలో పారిపో చూసే వాళ్లకు తప్ప, మిగతా వాళ్ళకు నా నుంచి ఎలాంటి హానీ జరగదు,'' అన్నాడు.

ఆ మాటలతో గ్రామస్థులకు కొంచెం ధైర్యం కలిగింది. ఏనుగు మీద వున్న వాడు ఎంత వికృత రూపుడైనా, వాడి మాటల తీరునుబట్టి, వాడు మనిషే అనుకున్నారు వాళ్ళు.

మాటా పలుకూ లేకుండా, నివ్వెరపడి చూస్తున్న గ్రామస్థులను తిరిగి వికృతా



కారుడే పలకరించి, "మీలో పెద్ద ఎవడు? ఇక్కడ మంచె మీద వున్న వాడు, మీ గ్రామం కుర్రాడేనా? వాడితో నాకు ఆహారం తెమ్మనీ, ఒక వైద్యుణ్ణి కూడా వెంటబెట్టుకు రమ్మనీ చెప్పానే! కాని, మీరు కర్రలూ, కత్తులతో నన్ను చంపేందుకు యిక్కడి కొచ్చినట్టుంది. అవునా?" అని ప్రశ్నించాడు.

ఆ సరికి గ్రామపెద్ద భయం పోయి, బాగా తేరుకున్నాడు. రూపానికి భయంకరుడే కాని, తతిమ్మా విషయాల్లో వికృతాకారుడు తమలాంటి వాడేనని అతడికి తోచింది. ఆ వెంటనే అతడు, వికృతాకారుడికి చేయెత్తి నమస్కరిస్తూ, ఏనుగును సమీపించి, "అయ్యా, మొసలి దొరా! మమ్మల్ని క్షమించాలి. మీరనే ఆ కుర్రాడు, మా గ్రామం వాడే. వాడు, మీరు చెప్పమన్న మాటలు మాతో చెప్పాడు. కాని, వింత ఏనుగు, వింత మనిషి అంటూ వాడు మాట్టాడిన తీరు చూసి, మేము నమ్మలేక పోయాం. ఈ కొండలూ, అరణ్య ప్రాంతాల అన్ని రకాల క్రూరమృగాలతోపాటు, అడవి ఏనుగుల మందలు కూడా తిరుగుతుంటవి. ఆ ఏనుగులేవో వచ్చి మా జొన్నచేల మీద పడినవనుకున్నాము," అన్నాడు.

ఏనుగు మీది మొసలి ఆకారం వాడు చేయెత్తి, "ఒరే, గ్రామ పెద్దా! నువ్వు అసలు సంగతి తప్ప, అనవసరమైన సంగతులు చాలా మాట్టాడావు. ఇంతకూ, మీరు, నా కోసం ఆహారాన్ని, వైద్యుణ్ణీ తెచ్చారా లేదా?" అన్నాడు.

వాడి కోపం చూసి గ్రామ పెద్ద వెనక్కు అడుగు వేసి, "అయ్యా, మొసలి దొరా! తమ కోసం పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం మా ఇంట తయారవుతున్నది. ఇక వైద్యుడంటారా? ఒకళ్ళను కాదు, ఇద్దర్ని తీసుకొచ్చాం," అన్నాడు.

మొసలి ఆకారం వాడు తన డొక్కలో నుంచి బయటికి పొడుచుకు వచ్చిన

విరిగిన కత్తి కేసి ఒకసారి చూసుకుని, చిన్నగా మూలిగి, "ఆ వైద్యులెక్కడ?" అంటూ జనం కేసి పరీక్షగా చూడ సాగాడు.

గ్రామ పెద్ద తెలివైనవాడు, జిత్తుల మారి. అతడు తన చేతిలోని పొన్ను కర్రను పైకెత్తి, వెనక వున్న గ్రామస్థుల కేసి తిరిగి, "ఒరే, మీలో ఒకరిద్దరు వెంటనే గ్రామానికి పరిగెత్తిపోయి, మొసలి దొరకు క్షణాల మీద ఆహారం పట్టుకు రావాలి. మన చరకాచారిగా రెక్కడ? వీరనారాయుడు ఎక్కడ చచ్చాడు?" అన్నాడు.




అతడు మాట ముగించేలోపలే, జనం లోని కొందరు చరకాచారినీ, వీరనారాయుణ్ణీ ముందుకు తోశారు. కాని, వాళ్ళు భయంతో గింజుకుంటూ వెనక్కు పోయి దాక్కోవాలని చూస్తున్నారు. గ్రామ పెద్ద పోయి, చరకాచారినీ, వీరనారాయుణ్ణీ చేతులు పట్టుకుని ముందుకు లాగి, మొసలిఆకారంవాడితో, "మొసలిదొరా! వీళ్ళే మా గ్రామవైద్యులు. ఇద్దరూ మంచి హస్తవాసిగలవాళ్ళు," అన్నాడు.

మొసలిఆకారంవాడు, వాళ్ళిద్దరి కేసి చూసి, ఆ క్షణం వరకూ తలను కప్పి వున్న శిరస్త్రాణాన్ని వెనక్కు లాగాడు. ఇప్పుడు అతడి ముఖం గ్రామస్థులందరూ స్పష్టంగా చూశారు. అతడికి నలభైవీళ్ళ కన్న ఎక్కువ వయసుండదు. ఎర్రనిదేహచ్ఛాయ, భుజాల మీదికి పడుతున్న నల్లని ఉంగరాలజుట్టు.

"మామూలు మనిషే! ఏదో రాజకుటుంబీకుడిలా వున్నాడు," అన్నాడు శస్త్రవైద్యం నేర్చిన వీరనారాయుడు, పక్కనున్న చరకాచారితో.

"రాక్షసులు కామరూపులు. కావాలనుకున్న రూపాన్ని క్షణాలమీద ధరించగలరు. ఏదైనా మా గురువుగారికి చేసిన ప్రమాణం ప్రకారం, రోగగ్రస్తుడైనవాడు, రాక్షసుడైనా, పిశాచం అయినా నేను వైద్యం చేస్తాను," అన్నాడు చరకాచారి.




'' నేనూ, వైద్యం నేర్పిన మా అయ్యకు దగ్గిర అలాంటి ప్రమాణమే చేశాను. ఊఁ, తమరు ముందు నడవండి,'' అన్నాడు వీరనారాయుడు.

వైద్యులిద్దరికీ మొసలి ఆకారంవాడి భయం పోయిందని గ్రహించి, గ్రామ పెద్ద పక్కకు తప్పుకున్నాడు. చరకాచారీ, వీరనారాయుడూ ఏనుగును సమీపించారు. ఆచారి తల ఎత్తి, '' మొసలిప్రభూ! తమను పట్టి పీడిస్తున్న వ్యాధి ఏమిటి? దాని లక్షణాలు సెలవివ్వండి,'' అన్నాడు.

మొసలిఆకారంవాడు ఆ ప్రశ్నకు కోపంతెచ్చుకుని, '' నీకు దృష్టిమాంద్యం లేదుగదా? నేను మీ గ్రామం కుర్రాడితో చెప్పి పంపిన మాటేమిటి? ఇదుగో, డొక్కలో గుచ్చుకున్న యీ కత్తిని బయిటికి లాగి, నేను చావకుండా చూడాలి. తెలివితక్కువకొద్దీ నా కేమైనా ప్రాణాపాయం కలిగించారో, మీ యిద్దరినీ ఏనుగు చేత నజ్జునజ్జయేలా తొక్కిస్తాను,'' అన్నాడు.

చరకాచారి చప్పున ఒకడుగు వెనక్కి వేసి, '' ప్రభూ, యీ వీరనారాయుడు శస్త్రవైద్యంలో సాటిలేనివాడు. ఆ కత్తిని అతడు బయిటికి లాగనివ్వండి. యీ లోపల నేను, గాయం మానేందుకు అవసరం అయిన మూలికలూ అవీ పోగు చేసుకు వస్తాను,'' అంటూ గబగబా ఆ పక్కనవున్న గుబురు చెట్ల కేసి బయలుదేరాడు.

'' నేను కత్తి లాగిన అరఘడియలో, రక్తస్రావం కాకుండా మీరు, గాయానికి కట్లు కట్టాలి. త్వరగారండి, చరకాచారి గారూ,'' అని కేకవేశాడు వీరనారాయుడు.

తరవాత అతడు మొసలిఆకారంవాడు అందించిన చేయి పట్టుకుని, ఏనుగు మీదికి పోయాడు. ఆ వికృతాకారుడి డొక్కలో దిగివున్న కత్తిని పరీక్షగా చూసి, '' దొరా! కత్తి తళ తళ మెరుస్తున్నది ఇదేదో రాచకత్తిలా వుందే! '' అన్నాడు వీరనారాయుడు.

మొసలిఆకారంవాడు ఆ మాటలకు విసుక్కుని, పెద్దగా మూలిగి, "ఇది రాచకత్తిలా వుండటం కాదు, రాచకత్తే! ఒకానొక పొగరుబోతు రాజకుమారుడు, నా మీద తిరగబడి కత్తితో బలంగా డొక్కలో పొడిచాడు. ఈ మొసలిచర్మం కవచం నన్ను చావకుండా కాపాడింది. ఆ కుర్రాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని యత్నం చేసి, నేనొక్కణ్ణే యీ ఆపద ంతెచ్చుకున్నాను. నా తోటివాళ్ళు ఆనం ంగా తిరిగి పోయారు. నే నీ ప్రాంతాల మతిచెడి తిరుగుతున్నాను," అన్నాడు.

ఈ జవాబుతో వీరనారాయుడికి, తమ రాజుగారి కుమారుడూ, కుమార్తె అపహరించబడిన సంగతి గుర్తుకొచ్చింది. వాళ్ళను అరణ్యంలో నుంచి బలవంతంగా ఎత్తుకుపోయిన ముఠాలోనివాడన్నమాట వీడు—అనుకున్నాడు, వీరనారాయుడు. ఇప్పుడు తాను, వీణ్ణి డొక్కల్లో నుంచి కత్తిలాగే ప్రయత్నంలో, కత్తిని అటూయిటూ బాగా కుదిలించి, ప్రాణాలు తీయవచ్చు. కాని, అందువల్ల రాజుగారి పిల్లలు ఎక్కడ నిర్బంధంలో వున్నారో తెలియకుండా పోతుంది. కనక, యీ దుర్మార్గుణ్ణి చావకుండా కాపాడి, రాజుగారికి ఒప్పచెప్పటం మేలనుకున్నాడు, వీరనారాయుడు.



క్షణాల మీద వీరనారాయుడు ఆలోచించి, తాను వెంటతెచ్చిన చిన్నకత్తులనూ ఇనుపసలాకలనూ దుస్తుల్లో నుంచి బయటికి తీసి, "దొరా! చరకాచారిగారిని రానీయండి. కత్తి బయటకి లాగిన మరుక్షణం గాయానికి కట్టు కట్టకపోతే ప్రమాదం," అని, దూరంగా నిలబడి వున్న గ్రామపెద్దతో, "ఇక్కడ దొరకు చికిత్స పూర్తయింతరవాత, వారిని మన గ్రామం తీసుకుపోవాలి. ముందుగా మనిషిని పంపి, అక్కడ వారి విడిదికి తగిన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

వీరనారాయుడు యిలా అనగానే, మొసలి ఆకారంవాడు అతడి కేసి కను



బొమలు ముడిచి గుచ్చిగుచ్చి చూస్తూ, "ఒరే, నీ పేరేమన్నావు, వీరనారాయుడా?" అంటూ, వీరనాయుడి మెడ పట్టుకుని పైకెత్తి, ''బాధకొద్దీ, నే అన్న మాటలవల్ల, నే నెవరైందీ నువ్వు గ్రహించినట్టుంది. కాని, ఆ సంగతి మీ గ్రామపెద్దతో గాని, మరెవరితోనైనా గాని అన్నావో, నీ ప్రాణాలు నిలువునా తీస్తాను. తెలిసిందా ?'' అన్నాడు.

వీరనారాయుడు గడగడ వణికిపోతూ, ''మొసలిదొరా, నన్ను చంపకండి! మా రాజుగారూ, మీరూ సమ ఉజ్జీలు. ఏదో కూరగాయ వైద్యం చేసుకు బతికే వాణ్ణి నేను. కాస్త పళ్ళబిగువున బాధను తట్టుకోండి. కత్తి బయిటికి లాగబోతున్నాను.'' అన్నాడు.

మొసలి ఆకారంవాడు, నారాయుణ్ణి వదిలాడు. నారాయుడు కత్తిని మెల్లిగా అటూ యిటూ కదిలించి చూసి, రెండు చేతులతో బలంగా పట్టుకుని లాగబోతున్నంతలో, దూరంగా చెట్ల వెనకనుంచి, చరకాచారి వేసిన, ''రక్షించండి! రక్షించండి!'' అన్న కేక, ఆ వెంటనే రెం[డు] మూడు ఏనుగులు ఒక్కసారిగా దూ[రం] నుంచి ఘీంకరించటం వినబడింది.

ఏనుగుల ఘీంకరింపులూ, చరకాచారి కేకలూ వింటూనే మొసలి ఆకారంవాడు చప్పున ఆ ధ్వనులు వచ్చిన వైపుకు తల తిప్పాడు. ఆ రెండు ధ్వనులూ వచ్చిన దిక్కు పరిశీలించి చూస్తే, చరకాచారి ఆర్తనాదానికి కారణం, అడవి ఏనుగుల ప్రమాదం కాదని అతడికి తోచింది. ఆ ఏనుగులు మరింత దూరం నుంచి ఘీంకరిస్తున్నవి. అయినా చరకాచారి ఆర్తనాదాలు చేస్తున్నాడు!

ఈలోపల గ్రామస్థులంతా భయకంపితులైపోయారు. వాళ్ళకు అడవి ఏనుగులంటె, పులులా, సింహాలకన్న కూడా ఎక్కువ భయం. అవి ఒకేసారి గ్రామాల మీద పడి, నివాసగృహాలను నేలమట్టం చేయటం వాళ్ళెరుగుదురు.

గ్రామపెద్ద, మొసలి ఆకారం వాణ్ణి సమీపించి, "మొసలిదొరా! చరకాచారి గారు ఒక్క కేక మాత్రం పెట్టి పూరుకున్నాడు. అంటే, ఆయన కెదురైన ప్రమాదమేదో, ఆయన్ని పొట్టబెట్టుకున్నట్టేగదా? కనక, ఆ అడవి ఏనుగుల మంద మన మీదికి వచ్చి పడకముందే, మనం గ్రామం చేరటం మంచిది." అన్నాడు.

"బాగానే వుంది! మరి నా చికిత్స మాటేమిటి? ఎంతకాలం యీ విరిగిన కత్తిని డొక్కలో పెట్టుకుని తిరిగేది?" అన్నాడు మొసలి ఆకారంవాడు.

వీరనారాయుడు ఏనుగుల ఘీంకరింపులు వస్తున్న దిక్కు కేసి చూసి, నిలువెల్లా వణికిపోతూ, "మొసలిదొరా, మా గ్రామ పెద్ద అన్నదే సబబు!" అన్నాడు.

మొసలి ఆకారంవాడు తనేదో పెద్ద చిక్కుల్లో తల దూర్చబోతున్నాననుకుని, బెంబేలు పడిపోతూ, ఏమి చేయటమా అని ఆలోచించేంతలో, యీసారి చరకాచారి, "అయ్యో, రక్షించండి!" అంటూ ఒక చావు కేక పెటాడు. అదేసమయంలో దూరం నుంచి కొన్ని అడవి ఏనుగులు తుప్పలూ, పొదలూ నలగదొక్కుతూ, చెట్లకొమ్మలను ఫెళఫెళమని విరుస్తూ, వేగంగా రాసాగినై.

ఇదంతా చూసిన గ్రామపెద్ద చేతిలోని పొన్ను కర్రను పైకెత్తి, తన గ్రామం వాళ్ళతో, "ఒరే, యిక్కడ మరొక క్షణకాలంవున్నా, మనం చచ్చిన వాళ్ళకిందే జమ. కాలిసత్తువ కొద్దీ గ్రామం కేసి పరిగెత్తండి." అని హెచ్చరించాడు.

గ్రామస్థులంతా వెనుదిరిగి పరులంకించుకున్నారు. మొసలి ఆకారంవాడు చప్పున తన శిరస్త్రాణాన్ని తలమీదికి దించుకుని, ఏనుగును అదిలించి, పొడవాటి శూలాన్ని ఎత్తి పట్టుకున్నాడు. వీరనారాయుడు ఏనుగు మీద గెంతుతూ, "అయ్యో, రక్షించండి!" అంటూ చరకాచారి కన్న పెద్దగా కేకలు పెట్టసాగాడు.

—(ఇంకావుంది.)






# మణి చేసిన పరిణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం ఫలించినప్పటికీ, దాని వల్ల ప్రయోజనం లేకుండా పోయే పరిస్థితులు ఏర్పడవచ్చు. అందుకు నిదర్శనంగా నీకు విజయవర్మ అనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం కళింగరాజ్యాన్ని విజయవర్మ అనే రాజు పరిపాలించాడు. అతను యుక్తవయసు రాగానే రాజ్యాభిషేకం చేసుకుని, తనకు తగిన రాచకన్నెను, సునందిని అనేదాన్ని, పెళ్ళాడాడు.

తరవాత కొద్ది రోజులకే సునందినికి ఒక విచిత్రమైన వ్యాధి సోకి, ఆమె క్రమ

## బేతాళ కథలు



క్రమంగా క్షీణించసాగింది. ఆమెను పరీక్షించిన రాజవైద్యుడు ఆమెది మానసికవ్యాధి కాదనీ, శరీరానికి సంబంధించినదే ననీ, అయితే దానికి సరి అయిన చికిత్స లేదనీ, ఎక్కడైనా నాగమణి సంపాదిస్తే దానితో ఆ వ్యాధి సులువుగా నయమవుతుందనీ చెప్పాడు. నూరేళ్ళు మనిషి కంటపడకుండా జీవించిన నాగసర్పం తలలో ఆ మణి మొలుస్తుందట. అలాటి సర్పం ఒకటి వింధ్యారణ్యాలలో తూర్పు ప్రాంతంలో ఉన్నట్టు తెలియవచ్చింది.

తన భార్య ఆరోగ్యం గురించి బెంగపడి ఉన్న విజయవర్మ రాజ్యపాలన అంతా తన మంత్రులకు వదిలి, నాగమణిని తీసుకు రావటానికి తన గుర్రం మీద బయలుదేరాడు. అతను అనేక అవాంతరాలను గడిచి, కొన్నాళ్ళకు వింధ్యారణ్యం చేరుకున్నాడు. ఆ అరణ్యం తూర్పు ప్రాంతంలో సంచరిస్తూండగా ఒక రాత్రి అంతదూరాన అతని వెన్నెల లాటి కాంతి కనబడింది. అ నాగమణి నుంచి వచ్చేకాంతి అయి ఉ వచ్చు ననుకుని అటుగా వెళ్ళి, ఒక పుట్టనూ, దాని సమీపంలో ఒక నాగసర్పాన్నీ, దాని నెత్తి మీది మ చూశాడు.

సర్పాన్ని చంపితేనే గాని మణిరాదు. సర్పాన్ని సమీపించటం ప్రమాదకరం. అందుచేత విజయవర్మ సమీపంలో ఉన్న చెట్టు ఎక్కి, తన వింటికి బాణం ఎక్కుపెట్టాడు. కాని అతను ఆ బాణాన్ని వదలలేదు. మొదటి బాణంతో అది చావకపోతే ఆ సర్పం తనకు అందకుండా పారిపోవచ్చు. లేదా అక్కడ వున్న పుట్టలోనో, గుబురుచెట్ల చాటునో దాగివుండి తను చెట్టు దిగగానే అది తనను చంపవచ్చు. అది పడగ విప్పితేనే గాని అతనికి గురికుదరదు.

అందుచే విజయవర్మ తాను ఎక్కుపెట్టిన బాణంతో, పాముకు ఎగువగా

ఉన్న చిన్న కొమ్మను కొట్టాడు. ఆ కొమ్మ మీద పడగానే పాము పడగవిప్పి, బుసలు కొట్టింది. మరుక్షణమే విజయవర్మ మరొక బాణంతో పాముపడగ రెండుగా చీలేటట్టు కొట్టాడు.

పాము చచ్చిపోయింది. విజయవర్మ చెట్టు దిగి వచ్చి, పాముతల మీది [illegible]ణిని తీసుకున్నాడు. కాని అతను [illegible]ణితో అరణ్యంకుండా పోతూండగా, [illegible]వారే వేళకు మనుషుల కోలాహలం [illegible]ంచింది. వాళ్ళు ఎవరో అడివి [illegible]లు అయి ఉంటారనీ, వాళ్ళు తన [illegible]సే వస్తున్నారనీ అనుకుని, అతను నాగ మణిని భద్రంగా దాపులనున్న ఒక పొదలో దాచాడు.

మరి కొద్ది క్షణాలకల్లా కొందరు అడవి జాతివాళ్లు వచ్చి, అతన్ని చుట్టుముట్టారు. గత్యంతరం లేక అతను వాళ్ళకు పట్టుబడిపోయాడు. వాళ్లు అతని ఆయుధాలు లాక్కుని, చేతులు కట్టి, తమ పల్లెకు తీసుకుపోయారు. వాళ్ళ మాటలను బట్టి, వాళ్ళు తనను తమ దేవతకు బలి ఇచ్చే ఉద్దేశంతో ఉన్నట్టు అతను గ్రహించాడు. ఈ ప్రాణాపాయం నుంచి ఎలా తప్పించుకోవాలా అన్న తీవ్రమైన సమస్య అతన్ని పట్టుకున్నది.

అటవికుల నాయకుడికి చిత్రలేఖ అనే ఒక కుమార్తె ఉన్నది. ఆమె చాలా అందంగా ఉంటుంది. ఆమె విజయవర్మను చూడగానే అతన్ని మోహించి,





తన తండ్రితో, "ఆ రాచయువకుణ్ణి దేవతకు బలి ఇయ్యటానికి వీల్లేదు. అతన్ని నేను పెళ్ళాడదలిచాను. కాదంటే నన్ను కూడా దేవతకు బలి ఇయ్యి." అన్నది.

"నాగరికుడు దొరికితే దేవతకు బలి ఇయ్యటం మన జాతి నియమం గదా! ఆ నియమాన్ని ఎలా దాటటం? పోనీ ఒక పని చేద్దాం. నేనూ, ఆ యువకుడూ పోట్లాడతాం. అతను గెలిస్తే, వీరుడి కింద జమకట్టి, విడిచిపెడతాను. ఆ తరవాత సాధ్యమైతే నువు అతణ్ణి పెళ్ళిచేసుకో. నా అభ్యంతరం ఏమీ వుండదు." అన్నాడు చిత్రలేఖ తండ్రి.

విజయవర్మకూ, జాతినాయకుడికీ పోరాటం జరిగింది. చిత్రలేఖ తండ్రి నిజంగానే ఓడాడో, కావాలని ఓడాడో గాని, పోటీలో చివరకు విజయవర్మ గెలిచాడు.

తరవాత చిత్రలేఖ అతని ఎదటికి వచ్చింది. ఆమె అందం చూసి దిగ్భ్రాం తుడై, ఆమెను పెళ్ళాడాలన్న కోరి తనకుతానుగానే బయటపెట్టాడు విజ వర్మ. అతను చిత్రలేఖకు తన సం అంతా చెప్పి, తాను తన నగరానికి వెళ్ళబోతూ, చిత్రలేఖను తన వెం పంపమని ఆమె తండ్రిని అడిగాడు.

"మేం ఏంతో కాలంగా నాగమణి కోసం ప్రయత్నిస్తున్నాం. అది నీకు దొరికిందట. దాన్ని నాకు ఇచ్చేసి చిత్రలేఖను నీ వెంట తీసుకుపో." అన్నాడు ఆటవికుల నాయకుడు.

చిత్రలేఖ కూడా, నాగమణిని తన తండ్రికి ఇచ్చేస్తే తాను విజయవర్మ వెంట వచ్చేస్తానన్నది.

విజయవర్మ కొంచెం తటపటాయించి, చిత్రలేఖతో, "నేను నాగమణిని ఇయ్యను. నువు దానికోసమే నన్ను పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్న పక్షంలో, నీతో నాకు పని లేదు." అంటూ చరచరా వెళ్ళిపో బోయాడు.

చిత్రలేఖ తండ్రి అతన్ని ఆపి, "నాగమణి నాకు అవసరం లేదులే. నువు నాగమణిని నా కిచ్చి ఉంటే చిత్రలేఖ నీకు దక్కి ఉండేది కాదు. నువు ఆమెను నిరాటంకంగా నీ నగరానికి తీసుకుపోవచ్చు," అన్నాడు.

విజయవర్మ నాగమణితో బాటు చిత్రలేఖను కూడా తీసుకుపోయి, మణి సహాయంతో సునందిని ఆరోగ్యం బాగు చేయించుకుని, ఇద్దరు భార్యలతోనూ సుఖంగా జీవించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విజయవర్మ మణి ఇయ్యటానికి ఎందుకు నిరాకరించాడు? సునందిని పైన ఉన్నంత ప్రేమ చిత్రలేఖ మీద లేకపోవటం చేతనా? మొదట మణి ఇస్తే గాని తన కూతురిని విజయవర్మ వెంట పంపను అన్న అడవిజాతి నాయకుడు తన అభిప్రాయం మార్చుకోవటమే గాక, విజయవర్మ మణిని ఇచ్చి ఉంటే చిత్రలేఖను కూడా పోగొట్టుకుని ఉండేవాడనటంలో అంతరార్థం ఏమిటి? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విజయవర్మ చిత్రలేఖ కోసం తాను పడిన శ్రమ అంతా వ్యర్థం చేసుకునేటంత చపలచిత్తుడు కాడు. చిత్రలేఖ అందం చూసి మోహించిన మాత్రాన అతను సునందిని క్షేమం మరిచిపోయేవాడూ కాడు. పోతే, చిత్రలేఖ తండ్రి ఆ విషయమే అతన్ని పరీక్షించాడనాలి. రెండో భార్య మీది మోజు కొద్దీ మొదటి భార్య పట్ల అలక్ష్యం చేసేవాడు రేపు మరొక భార్య కోసం చిత్రలేఖను వదలవచ్చు. విజయవర్మ తన మాట విని మణిని ఇచ్చి ఉంటే ఆయన చిత్రలేఖను అతని వెంట పంప నిరాకరించి ఉండేవాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఇద్దరు భార్యలు

పూర్వం ఒక రాజుకు మాలినీ, మంజరీ అని ఇద్దరు భార్య లుండేవారు. ఇద్దరూ అపురూప సౌందర్యవతులు. రాజుకు ఇద్దరి పైనా సమంగానే ప్రేమ ఉండేది. ఇద్దరిలో ఎవరు అలిగినా ఆయన చాలా బాధపడిపోయేవాడు. అయితే ఆ ఇద్దరికీ ఒక్క క్షణం కూడా పడేది కాదు. అందు చేత ఎవరో ఒకరు ఏదో ఒక కారణం చూసుకుని అలుగుతూ ఉండేవారు. వాళ్ళ అలకలు తీర్చలేక రాజు బాధపడి పోయేవాడు.

ఇలా బాధపడి, బాధపడి, చివరకు రాజు పెద్ద జీతం యిచ్చి నరహరి అనే ఒక అంతరంగిక సలహాదారును నియమించుకున్నాడు.

ఈ నరహరి మంచి చమత్కారీ, సమయ స్ఫూర్తి గలవాడూనూ. రాణులు అకారణంగా అలిగినప్పుడల్లా తన చాతుర్యంతో వాళ్ళ అలకలు తీర్చి, రాజుగారికి మనశ్శాంతి కలిగేటట్టు చూడటం నరహరి పని. నరహరిని నియమించినాక రాజు గారికి నిజంగానే మనసు కాస్త స్థిమిత పడింది. రాజు భార్యల అలకలు తీర్చటంలో నరహరి ఎంతో సమర్థత చూపాడు.

ఇలా ఉండగా ఒకసారి ఒక ప్రఖ్యాత చిత్రకారుడు ఆ రాజ్యానికి వచ్చాడు. అతను అందగత్తెలయిన అంతఃపుర స్త్రీల చిత్తరువులు మాత్రమే గీస్తాడు. అందు చేత, మాలినీ, మంజరీ ముచ్చటపడి, తమ తమ చిత్తరువులు అతని చేత వేయించుకున్నారు.

చిత్రకారుడు తన నైపుణ్యం అంతా వినియోగించి, జీవం ఉట్టిపడేలా ఇద్దరు రాణుల చిత్తరువులూ తయారుచేసి, వారికి యిచ్చాడు.

ఎం. కామేశ్వరరావు

రాణు లిద్దరూ తమ చిత్రాలను రాజుకు చూపించారు. రాజు మంజరి చిత్తరువును చూసి పక్కన పెట్టేసి, మాలిని చిత్తరువును చూసి, "అద్భుతం! అత్యద్భుతం!" అని నోరుజారి మెచ్చుకుని, పరమానందం పొందాడు.

అంతే! మంజరి మొహంలో ఒక్కసారిగా రంగులు మారిపోయాయి. ఆమె తన చిత్రపటాన్ని అక్కడే వదిలేసి, "మాలిని నా కన్న ముందు పటం గీయించుకున్నది. నా పటం గీయ వచ్చే సరికి చిత్రకారుడికి విసుగుపుట్టి ఉండవచ్చు. అంతమాత్రాన నా అందాన్ని అవమానిస్తారా?" అని బుసలుకొడుతూ, రాజు ఎంత బతిమాలుతున్నా వినిపించుకోకుండా విసవిసా తన మందిరానికి వెళ్లిపోయింది.

చిత్రకారుణ్ణి పంపేసి, నరహరికి కబురుపెట్టి, రాజు తల పట్టుకుని కూర్చున్నాడు.

నరహరి వచ్చాడు. రాజుకు ప్రాణం లేచివచ్చింది. ఆయన నరహరికి జరిగినదంతా చెప్పి, "ఇక ఏం చేస్తావో, నీదే భారం! రాణీగారి కోపం ఎలా పోగొడతావో ఏమో!" అన్నాడు.

నరహరి చిరునవ్వు నవ్వి, "మీరేమీ విచారించవద్దు. క్షణంలో అంతా సరి చేస్తాను." అంటూ మంజరి విడిచివెళ్ళిన చిత్తరువు తీసుకుని, ఆమె మందిరానికి వెళ్ళాడు.



మంజరి కోపోద్రేకంతో అటూ ఇటూ పచార్లు చేస్తున్నది.

"అమ్మా, మీరు ఈ చిత్తరువును మరిచి వచ్చారు," అంటూ నరహరి చిత్తరువును ఆమెకు ఇయ్యబోయాడు.

"దాన్ని అవతల పారెయ్యి. నేను పారేసినదాన్ని ఎందుకు తెచ్చావు? దాని మూలంగా ఇవాళ నా అందానికి అవమానం జరిగింది," అన్నది మంజరి.

నరహరి ఆశ్చర్యం అభినయిస్తూ, "అదేమిటమ్మా, నేను వచ్చేసరికి రాజుగారు మీ అందాన్నే కదా తెగ మెచ్చుకుంటున్నారు!" అన్నాడు.

"అబద్ధాలు చెప్పి నువేమీ నన్ను మభ్యపెట్ట నవసరం లేదు. రాజుగారు నా చిత్రాన్ని ఒకసారి చూసి పక్కన పెట్టేసి, అలుపు వచ్చేదాకా మాలిని అందాన్ని తెగపొగిడారు," అని మంజరి రుసరుసలాడింది.

నరహరి పెద్దగా నవ్వి, "అందుకు మాలినీదేవిగారికి కోపం రావాలి గాని, మీకు కోపం దేనికి? మీ చిత్తరువు ఎంత బాగున్నా మిమ్మల్ని రోజూ చూసేవారికి అది అంత బాగులేదంటే, మీ అందం చిత్తరువులోకి పూర్తిగా రాలేదనే గదా అర్థం! మాలినీదేవిగారి కన్న ఆమె చిత్తరువు బాగున్నట్టు రాజుగారికి తోచింది. వారు ఆమె చిత్తరువును మెచ్చుకోవటం ఆమె అందాన్ని కించపరచటమే గదా!" అన్నాడు.

మంజరి మొహం విప్పారింది. ఆమె చప్పున తన మెడలోని హారం తీసి నరహరి చేతిలో పెట్టి, "నేను అంతదూరం ఆలోచించలేదు సుమా! ఈ హారం తీసుకుపోయి నీ భార్యకియ్యి," అన్నది.

"అమ్మా, నాకిప్పుడు మరో హారం కొనే తాహతులేదు. నా చేతికింద ఆంతరంగిక సలహాదారూ లేడు. అలకపరిచిన వాళ్ళను శాంత పరచటం నా వల్ల కాదు. నాకు కూడా ఇద్దరు భార్యలున్నారు-దేవాంతకురాళ్ళు!" అంటూ నరహరి ఆ హారాన్ని తీసుకోకుండా వెళ్ళిపోయాడు.





# తండ్రిని మించినవాడు

ఒకసారి యమధర్మరాజుకు తన ఒంటరి జీవితం మీదా, నరకం పరిసరాల మీదా ఏవగింపు పుట్టింది. అతను ఒక్కసారి భూలోకానికి వచ్చాడు. వసంతకాలపు శోభతో ప్రకృతి మహా ఆకర్షవంతంగా ఉన్నది. చక్కని సూర్యకాంతి అంతటా ప్రకాశిస్తున్నది. యముడికి భూలోకం మహా ఆనందమయంగా కనిపించింది.

యముడు భూసంచారం చేస్తూండగా ఒకచోట ఒక అందమైన స్త్రీ కనిపించింది. ఆమె ఒక పురుషుడితో తగవులాడుతున్నది. ఆమెతో మాటకు మాట అనలేక ఆ పురుషుడు ఓడిపోయి, పారిపోయాడు. ఆమె అందమూ, ఆమె ధైర్యసాహసాలూ చూసి యముడు ముచ్చటపడి, ఆమెను పెళ్ళాడాలనుకున్నాడు.

అందుకు ఏం చెయ్యాలి ? తన దూతలను పంపితే వాళ్ళు ఆమెను ప్రాణాలతో తీసుకురాలేరు. అదీ గాక, ఆమెతో కాపరం చేస్తూ భూలోకంలోనే కొంత కాలం ఉండాలని యముడి ఉద్దేశం. అందుచేత అతను అందమైన యువకుడి రూపం ధరించి, ఆమెకు తన అభిప్రాయం చెప్పాడు. ఆమె అతన్ని పెళ్ళాడటానికి ఒప్పుకున్నది. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా కాపరం చేశారు. వారికి ఒక కొడుకు కూడా కలిగాడు.

కొడుకు పుట్టిన తరవాత యముడి భార్యకు కొడుకుతోడిదే లోకమయింది. ఆమెకు భర్తమీద అనురాగం క్షీణించింది. రానురాను అతన్ని ఆమె, అది కావాలనీ, ఇది కావాలనీ వేధించసాగింది. యముడు ఎంతో ఓపికగా ఆమె కోరికలన్నీ తనకు చాతనయిన విధంగా తీర్చుతూ, ఆమెను తృప్తి పరచటానికి యత్నించాడు. కాని ఆమెకు తృప్తి లేకుండాపోయింది. ఆమె

కె. నాగరాజమ్మ



అతనిలో ఏవో తప్పులు వెతుకుతూ, అతని పట్ల ఏ మాత్రమూ లక్ష్యంలేకుండా ప్రవర్తించసాగింది.

ఖర్చులు నానాటికీ పెరుగుతున్నాయనీ, తన భర్తకు సంపాదన లేదనీ ఆమె అస్తమానమూ సాధిస్తూంటే, యముడు ఆమె బాధ పడలేక కొన్ని మందులూ, గుళికలూ తయారు చేసి, వైద్యం ప్రారంభించాడు. త్వరలోనే అతనికి ఆ చుట్టుపక్కల మంచి వైద్యుడుగా పేరువచ్చింది. ఆదాయం కూడా బాగానే ఉన్నది.

కాని యముడి భార్య మనస్థితి అంతకంతకూ దుర్భరస్థితికి వచ్చింది. చివరకు ఆమె గొంతు వినిపించినా యముడు ఉన్నచోటి నుంచి లేచి దూరంగా వెళ్ళిపోయేవాడు.

ఒకనాడు అకస్మాత్తుగా యమునికి, ఈ భార్యతో కాపరం కంటే, తన చీకటి లోకమూ, నరకకూపాలూ నయమనిపించింది. వెంటనే అతను అంతర్థానమయి తన లోకానికి వెళ్ళిపోయాడు.

యముడిభార్య భర్తకోసం ఏమాత్రమూ బెంగపడలేదు. ఆమె తన కొడుకును చూసుకుంటూ ఎంతో సుఖంగా ఉన్నది. ఆమె గారాబంతో యమ కుమారుడు ఎందుకూ పనికిరానివాడుగా తయారయాడు. కొంత కాలానికి ఆమె మరణించింది.

ఒంటరిగాడుగా మిగిలిన యమకుమారుడికి ఎలా బతకాలో తెలీలేదు. అతను తండ్రి చేసిన వైద్యవృత్తి జ్ఞాపకం తెచ్చుకుని, ఆ మందులతో తాను కూడా వైద్యం చెయ్యసాగాడు. తన తండ్రి ఏమయాడా అని అతను అప్పుడప్పుడూ ఆశ్చర్యపడుతూ ఉండేవాడు.

ఒకనాటి రాత్రి అతనికి తండ్రి కలలో కనబడి, "నాయనా, నువు వైద్యవృత్తి చేసుకో, వృద్ధిలోకి వస్తావు. కాని ఒక్క సంగతి గుర్తుంచుకో. ఎప్పుడు నువు రోగి వద్దకు వెళ్ళినా, మొట్ట మొదట రోగి తల

వైపుచూడు. అక్కడ నేను నీకు కనిపించి నట్టయితే, ఆ రోగికి వైద్యం చెయ్యకు. ఆ రోగి తప్పక చనిపోతాడు. నేను కని పించకపోతే వైద్యం చెయ్యి. నువు ఏ మందు యిచ్చినా ఆరోగి కోలుకుంటాడు." అని చెప్పి, అదృశ్యమయాడు.

నిద్రలేచినాక గాని యమకుమారుడికి తాను కన్నది కల అని తెలియలేదు. అయినా అతను ఆ కలను నమ్మి, ఆ ప్రకారమే వైద్యం చెయ్య నిశ్చయించు కున్నాడు. త్వరలోనే అతనికి మంచి పేరు వచ్చింది. అతను వైద్యం చేస్తానన్న తర వాత రోగి తప్పక బతికేవాడు. అతను వైద్యం చెయ్యనన్న రోగి తప్పక చని పోయేవాడు. అందుచేత ప్రజలకు అతని వైద్యంలో అపారమైన భక్తి కుదిరింది.

ఇలా ఉండగా ఒకసారి ఆ దేశపు రాజుగారి కూతురికి పెద్ద జబ్బు చేసింది. ఎన్ని చికిత్సలు చేసినా లాభం లేక పోయింది. ఆమె నానాటికీ క్షీణించ సాగింది. ఆమె బతకదని వైద్యులు చెప్పే శారు. రాజదంపతులు దుఃఖంతో కుంగి పోయారు.

అప్పుడు వారికి ఎవరో యమకుమారుడి పేరు సూచించారు. రాజు వెంటనే భటు లను పంపి అతన్ని పిలిపించాడు. యమ కుమారుడు రోగిని సమీపించి, తన అల



వాటు ప్రకారం రోగి తలవైపు పరీక్షగా చూశాడు. అక్కడ అతనికి తన తండ్రి కనిపించాడు.

యమకుమారుడు గతుక్కుమని, రోగి గది నుంచి అందరినీ బయటికి వెళ్ళ మని, తన తండ్రితో, "నాన్నా, నేను అభివృద్ధిలోకి రావటానికి ఇది మంచి అవకాశం. ఈమెను బతికిస్తే నాకు బోలె డంత కీర్తి, ధనమూ లభిస్తాయి. దయ చేసి ఈమెను వదిలి వెళ్ళిపొండి," అన్నాడు.

"నాయనా, ఇంకేదైనా కోరుకో, కాని ఈ నీ కోరిక తీర్చటం నాకు సాధ్యం కాదు. రాకుమార్తెను నేను తీసుకుపోయి తీరాలి.

నుదిటిరాతను నేను కాదుగదా ఎవరూ మార్చలేరు,'' అన్నాడు యముడు.

యమకుమారుడు ఎన్నో విధాల ప్రాధేయ పడ్డాడు, కాని ఫలితం లేక పోయింది. చిట్ట చివరకు యముడు తన కొడుకును చూసి జాలిపడి, ''మూడు రోజులు గడువు ఇస్తాను. ఈలోపల నువ్వు ఏదో విధంగా తప్పుకో,'' అని సలహా ఇచ్చి మాయమయాడు.

యమకుమారుడు రాజుతో, ''మహా రాజా, ఇది చాలా తీవ్రమైన వ్యాధి. ఇంకా మూడు రోజులు గడిస్తేనే గాని చెప్పలేను,'' అన్నాడు.

అతను రాత్రిం బగళ్ళు రాజకుమార్తె దగ్గిరే ఉండి వైద్యం చేశాడు. కాని తన చేతిలో ఏమీ లేదని తెలిసి, అతను తండ్రి రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. అయితే అతని బుర్ర పనిచేస్తూనే ఉన్నది. తండ్రి నుంచి రాకుమార్తెను ఎలా కాపాడటమా అని అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

గడువు తీరగానే యముడు కనిపించనే కనిపించాడు. తన కొడుక్కు ఏ విధంగానూ సహాయపడలేక - పోతున్నానన్న బాధ యముడి ముఖంలో కనబడింది.

కాని తండ్రిని చూడగానే యమకుమారుడికి మెరుపులాటి ఆలోచన తట్టింది. అతను చుట్టూ చూస్తూ, ''అమ్మా, ఎందుకు ఇంత ఆలస్యం చేశావు? త్వరగా రా! నాన్నగారు వచ్చి ఉన్నారు!'' అన్నాడు గట్టిగా.

మరుక్షణమే యముడు మాయమై, తన లోకానికి వెళ్ళాడు.

వెంటనే రాజకుమార్తె కళ్ళు తెరిచి చూడగలిగింది. ఆమెకు ఇక ప్రాణ భయంలేదని గ్రహించి, యమకుమారుడు రాజదంపతులకు ధైర్యం చెప్పి, తన వైద్యంతోనే రాజకుమార్తె రోగాన్ని నయం చేశాడు. రాజదంపతులు పరమానంద భరితులై, తమ కృతజ్ఞతను తెలుపుకోవటానికి యమకుమారుడికి తమ కుమార్తెనిచ్చి వైభవంగా పెళ్ళిచేశారు.



# 175. హిట్టైట్ దేవుడు

యూఫ్రాటిస్ నదీతీరాన సిరియాలో హిటైట్ నాగరికత విజృంభించి, క్రీస్తు పూర్వం 7 వ శతాబ్దిలో అంతమయింది. కార్కెమిష్ అనే చోట ఈ హిటైట్ దేవుడి విగ్రహం తవ్వకాలలో బయటపడింది.





# మంత్రియుక్తి

సోమశేఖర మహారాజు కింద అనేక దేశాలు ఉండేవి. వాటిని ఆయన సామంతులు పాలించేవారు. సోమశేఖరుడు పరిపాలనలో చాలా సమర్థుడు. తన సామంతులు కూడా తనలాగే తమ తమ దేశాలను సమర్థతతో పరిపాలించాలని ఆయన అభిప్రాయం. అందుచేత ఆయన అప్పుడప్పుడూ తన సామంతులు పరిపాలించే దేశాలకు వెళ్ళి, అక్కడ పరిపాలన ఎలా సాగుతున్నదీ స్వయంగా చూసి, తన సామంతుడు అసమర్థుడని తోస్తే, అతణ్ణి తొలగించి, అతడి స్థానంలో సమర్థుడని తనకు తోచినవాణ్ణి నియమించేవాడు.

ఒకసారి సోమశేఖరుడు మణిపుర రాజ్యాన్ని పర్యటించటానికి వెళ్ళాడు. ఆ సమయంలో మణిపురాన్ని పాలిస్తున్న చంద్రవర్మ ఏమంత తెలివితేటలు గలవాడు కాడు. అయితే అతని మంత్రి సుమంతుడు మంచి మేధావి. దురదృష్ట వశాన, సోమశేఖరుడు పర్యటించటానికి వచ్చే సమయానికి మణిపుర రాజ్య పరిస్థితి అంత బాగాలేదు. సోమశేఖరుడికీ, అతని పరివారానికీ మంత్రి సుమంతుడు అద్భుతమైన ఆతిథ్యమూ, వినోదాలూ ఏర్పాటు చేశాడు. ఆ విధంగా మణిపుర రాజ్య పరిస్థితిలో గల లోపాలు సోమశేఖరుడి కంట పడకుండా ఉంటాయని మంత్రి ఉద్దేశం.

ఆయన ఊహించినట్టే, సోమశేఖరుడు తనకు జరిగిన ఆతిథ్యానికి చాలా సంతోషించాడు. అయితే, మణిపుర రాజైన చంద్రవర్మ అమాయకత్వం మూలాన ఒక జరగరాని పొరపాటు జరిగిపోయింది. సోమశేఖరుడు వచ్చిన రాత్రి విందు వినోదాల అనంతరం ఆయనతో

గంగిశెట్టి శివకుమార్



చంద్రవర్మ చదరంగం ఆడి, ఆ ఆటలో సోమశేఖరుణ్ణి ఓడించాడు. సోమశేఖరుడి ముఖం నల్లగా అయిపోయింది. మంత్రి సుమంతుడి గుండెల్లో రాయి పడింది. సార్వభౌముణ్ణి గెలవనియ్యాలన్న జ్ఞానం లేకపోయినందుకు చంద్రవర్మ తన సింహాసనాన్నే పోగొట్టుకోవచ్చు. అలాంటి ప్రమాదం జరగకుండా ఉండేందుకు ఏమి చెయ్యాలా అని సుమంతుడు దీర్ఘంగా ఆలోచించాడు.

మర్నాడు మణిపుర దర్బారులో సోమశేఖరుడు అగ్రస్థానంలో కూర్చున్నాడు. సామంతుడు చంద్రవర్మ ఆయన సమీపంలోనే మరొక ఆసనం మీద కూర్చుని, తన కింది ముఖ్యోద్యోగులను సోమశేఖరుడికి పరిచయం చేస్తున్నాడు. రాజ్య పరిస్థితులను గురించి సోమశేఖరుడు అడిగిన ప్రశ్నలకు వాళ్లు జవాబులు చెబుతున్నారు.

ఆ సమయంలో ఒక యువకుడు సభలోకి వచ్చి, "మహాప్రభూ, నేను చదరంగ నిపుణుణ్ణి. మాది విదర్భ. దేశదేశాలు తిరుగుతున్నాను. ఇంతవరకు నన్ను చదరంగంలో ఓడించిన వాడు లేడు. సెలవైతే నా నైపుణ్యం ప్రదర్శించగలను. ఈ సభలో చదరంగం ఆడగలవారున్నారా?" అన్నాడు.

సోమశేఖరుడు చదరంగం పోటీకి అనుమతించిన మీదట, సభలో ఆ ఆట బాగా వచ్చిన వారందరూ ఒకరొకరుగా వచ్చి అతనితో చదరంగం ఆడి ఓడిపోయారు.

"ఇక్కడ కూడా నన్ను ఓడించగలవారు లేరన్నమాట! ఏం చేసేది? వచ్చిన దారినే విదర్భకు తిరిగిపోతాను," అన్నాడా యువకుడు.

"మా చంద్రవర్మ మహారాజుగారు గొప్ప చదరంగ నిపుణులు. వారితో ఆడు, తప్పక ఓడిపోతావు! ఆయనను ఓడించిన వారు ఇంతవరకూ ఎవరూ లేరు," అన్నాడు మంత్రి సుమంతుడు యువకుడితో.

ఆ యువకుడు చంద్రవర్మతో మూడు ఆటలు ఆడి, మూడుసార్లూ చంద్రవర్మను చిత్తుగా ఓడించాడు. ఇది చూసిన సభికులకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

''ఇంక నన్ను చదరంగం ఆటలో జయించగలవారు సభలో ఎవరూ లేనట్టే గదా! ఇక సెలవు తీసుకుంటాను,'' అన్నాడు యువకుడు దర్పంగా.

''తొందర పడకు! నీ శక్తి ఏమిటో సోమశేఖర మహాప్రభువుగారి మీద చూపించు,'' అన్నాడు మంత్రి సుమంతుడు.

సోమశేఖరుడు ఆ యువకుడితో ఆడక తప్పలేదు. మొదటి ఆట ప్రారంభమైన కొద్దినిమిషాలకే యువకుడి ఆట కట్టింది. యువకుడి ముఖం చిన్నబోయింది. అతను మరొక ఆట ఆడమని సోమశేఖరుణ్ణి వేడుకున్నాడు. ఈసారి యువకుడి ఆట మరింత తొందరగా కట్టింది.

యువకుడు సోమశేఖరుడికి జోహారు చేస్తూ, ''ఏలినవారిలాంటి ఆటగాణ్ణి నేనెక్కడా చూడలేదు. నా ప్రగల్భాలను మన్నించండి!'' అని సెలవు తీసుకుని దించిన తల ఎత్తకుండా సభ నుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

సోమశేఖరుడి ముఖాన విజయగర్వం తాండవించింది.

''బతికాము రా, దేవుడా!'' అనుకున్నాడు మంత్రి సుమంతుడు.

ఆ రాత్రి ఆయన ఇంటికి వెళ్ళగానే ఆయన మేనల్లుడు, "ఏమిటి, మామయ్యా? ఎన్నడూ చదరంగంలో ఓడని నన్ను ఆ మహారాజు మీద ఓడమన్నావు!'' అని చిరాకు పడ్డాడు.

''నువు మా రాజుగారి పదవి నిలబెట్టావురా! రేపే సోమశేఖర మహారాజు తిరిగి వెళ్ళిపోతున్నారు. ఆయన ఎంత ఆనందంలో ఉన్నాడో చెప్పలేను," అంటూ సుమంతుడు జరిగినదంతా తన మేనల్లుడికి చెప్పాడు.



# ఎవరు పేదవారు?

ఒక గ్రామంలో వైద్యసౌకర్యాలు అంతగా లేకపోవడంవల్ల, అక్కడి వారు ఎంతో ఇబ్బంది పడుతూ ఉండేవారు. ఒకసారి ఒక సన్యాసి ఆ గ్రామానికి వచ్చి అక్కడి వారి పరిస్థితి చూసి బాధపడి, ఒక వైద్యశాల కట్టించాడు. బీదలకు సాయపడే ఉద్దేశ్యంతో ఆ వైద్యశాలలో తన శిష్యులను ఉంచి, అక్కడ ఉచితంగా వైద్యంచేసే ఏర్పాట్లుచేసి వెళ్ళిపోయాడు.

ఆ వైద్యశాల ఆ గ్రామస్థులకే కాక, ఇరుగు పొరుగు ఊళ్ళలో వారికి కూడా ఎంతో ఉపయోగపడసాగింది. బాగా డబ్బున్న వారు కూడా అక్కడి ఉచిత వైద్యం కోసం రావడంతో వైద్యశాలను నడుపుతున్న ఆ సన్యాసి శిష్యులకు ఏంచెయ్యాలో తోచలేదు.

మళ్ళీ కొన్నాళ్ళకు ఆ సన్యాసి ఆ గ్రామానికి వచ్చాడు. వైద్యశాల నడుపుతున్న ఆయన శిష్యులు, ధనవంతులు కూడా ఉచితవైద్యం కోసం ఎగబడుతున్నారని ఆయనకు చెప్పి, అందుకు తాము ఏం చెయ్యాలని అడిగారు.

సన్యాసి నవ్వి, "మన వైద్యశాల బీదలకు సాయపడాలని మన ఉద్దేశ్యం. అది తెలిసి ఇక్కడికి వైద్యం కోసం ధనవంతులు వస్తే మనమేం చెయ్యాలి? వారికి వైద్యం చెయ్యవలసిందే! యాచించే వాడు ఎవడైనా పేదవాడే!" అన్నాడు. —పి. ఎస్. గోపాలకృష్ణ





# దేవీవరం

ఒక గ్రామంలో రామశాస్త్రి అనే జమీందారుండేవాడు. సాధారణంగా బ్రాహ్మణ జమీందారులుండరు. రామశాస్త్రి పూర్వీకుల్లో ఒకాయన ఉద్దండ పండితుడు. రాజుగారు ఆయన పాండిత్యానికి మెచ్చి, ఆయనకు కొన్ని గ్రామాలు బహూకరించాడు. అనాటి నుంచీ ఆ బ్రాహ్మణ వంశస్థులు జమీందారులయారు.

రామశాస్త్రికి యిద్దరు కొడుకులు. పెద్దవాడి పేరు సుగ్రీవశాస్త్రి. ఇతడు ఇరవై ఏళ్ళ వయసువాడు. తండ్రి తరవాత జమీందారయ్యే హక్కు యితడిదే. తండ్రి యితణ్ణి బాల్యంలోనే విద్యాభ్యాసం కోసం కాశీలో, మధురలో వున్న గొప్ప గొప్ప పండితుల దగ్గిరకు పంపాడు. సుగ్రీవశాస్త్రి శ్రద్ధగా చదివి, ఎంతో శాస్త్రజ్ఞానం సంపాయించాడు. అనేక కొత్త ప్రదేశాలు తిరిగి, చాలామంది సంస్కరణవాదులతో చర్చలు జరిపి, అతడు మత విషయాల పట్ల ఒక నూతన దృక్పథం అలవరుచుకున్నాడు. పుట్టిన కులాన్ని బట్టి, మనుష్యులకు ఉచ్చనీచలూ, అస్పృశ్యతా ఆపాదించే మతసూత్రాలకు అతడు బద్ధవిరోధి అయాడు.

ఇలాంటి ఉన్నతభావాలతో తిరిగి వచ్చిన సుగ్రీవశాస్త్రి, ముందుగా తమ ఇంటి పౌరోహితుడి కొడుకైన గుణభట్టును, తన ఆశయాలకు అనుకూలుణ్ణి చేసుకున్నాడు. ఆ తరవాత గ్రామంలో మరి కొందరు యువకులు సుగ్రీవశాస్త్రికి తోడయారు. వీళ్ళందరూ రామశాస్త్రికి తెలియకుండా, రాత్రివేళల్లో రహస్యంగా, అస్పృశ్యులు నివసించే గూడేలకు పోయి, రోగగ్రస్తులకు వైద్య సహాయం, తిండికి లేక పస్తులుండే వాళ్ళకు బియ్యం వగైరా యిస్తూండేవాళ్ళు.

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

ఇలా కొంతకాలం జరిగింది. ఒక మండువేసవికాలంలో, మిట్టమధ్యాహ్నం వేళ సుగ్రీవశాస్త్రి పొరుగూరు నుంచి తిరిగి వస్తూ, దారి పక్కనే వున్న మర్రి చెట్టు కింద చెప్పులు కుడుతున్న, రూపరాం అనే అస్పృశ్యుణ్ణి చూశాడు. సుగ్రీవశాస్త్రి అతణ్ణి బాగా ఎరుగు. అతడు రూపరాంను సమీపించి, "ఎలావున్నావు, రూపరాం? పిల్లలంతా కులాసాయేగదా?" అని అడిగాడు.



రూపరాం, సుగ్రీవశాస్త్రికి దణ్ణం పెట్టి, "బాబూ, మీ దయవల్ల అందరం కులాసాగానే వున్నాం. ఇంత ఎండలో ప్రయాణం ఏమిటి? కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి. దాహం వెయ్యటంలేదా?" అన్నాడు.

సుగ్రీవశాస్త్రి, రూపరాం పక్కనే వున్న చెక్కపెట్టె మీద కూర్చున్నాడు. అతడికి దాహంవెయ్యటమే కాదు, ఎండ తాపానికి నాలుక పిడచకట్టుకుపోతున్నది. రూపరాం అతడికి ముంతలో నుంచి యింత నీరు ఒక రాగిగ్లాసులో పోసి యిచ్చాడు. సుగ్రీవశాస్త్రి గ్లాసు అందుకుని తాగుతూండగా, దారి మలుపులో నుంచి గుర్రబ్బండి ఒకటి వేగంగా అటు కేసి వచ్చింది. బండిలో జమీందారు రామశాస్త్రి వున్నాడు. ఆయన ఏదో తొందరపనిమీద పొరుగు గ్రామం పోతున్నాడు. తన పెద్ద కొడుకు, అస్పృశ్యుడిచ్చిన నీరు తాగటం ఆయన కంటబడింది.

రామశాస్త్రి ఉగ్రుడైపోతూ, "సుగ్రీవ్, నువ్వు తక్షణం యింటికి వెళ్ళు. నేను తిరిగి వచ్చేవరకూ ఎక్కడికీ పోకు. నీతో మాట్లాడవలసిన ముఖ్య విషయం వున్నది," అన్నాడు.

సుగ్రీవశాస్త్రి జవాబు చెప్పేలోపలే గుర్రబ్బండి కదిలిపోయింది. రూపరాం నిలువెల్లా వణికిపోతూ, "చిన్నబాబూ! జమీందారు పెదబాబు, నేను మీకు మంచి నీళ్ళివ్వటం చూశాడు. ఇక నన్నాయన ప్రాణాలతో వదలడు. నా పెళ్ళాం బిడ్డల గతేమిటి?" అన్నాడు.



సుగ్రీవశాస్త్రికి తన తండ్రి మాట్లాడ దలచిన ముఖ్య విషయం ఏమిటో తెలుస్తూనే వున్నది. కాని అతడేమీ భయపడ లేదు. రూపరాం పరిస్థితి వేరు; అతడు పేదవాడు, అస్పృశ్యుడు!

''రూపరాం, నీ కొచ్చిన భయం ఏమీ లేదు. మా పౌరోహితుడి కొడుకు గుణ భట్టు ఇంట నీవు రహస్యంగా దాక్కో వచ్చు. నీ కుటుంబ సంరక్షణ సంగతి కూడా అతనే చూస్తాడు,'' అని ధైర్యం చెప్పాడు సుగ్రీవశాస్త్రి.

తరవాత అతడు ఇంటికిపోయి తల్లితో, ఏమీ దాచకుండా చెప్పేశాడు. ఆమె కళవెళపడిపోతూ, ''సుగ్రీవ్! మీ నాయన ఎలాంటి సనాతన ధర్మపరుడో నీకు తెలియంది కాదుగదా? తప్పు ఒప్పుకుని, క్షమించమని కోరు,'' అన్నది.

ఇందుకు సుగ్రీవశాస్త్రి అభ్యంతరం చెప్పి, ''అమ్మా, నేను నమ్మిన ఆదర్శాలకు అనుగుణంగా ప్రవర్తించాను. పశ్చాత్తాప పడవలసిందేమీ లేదు. అంత ముంచుకువస్తే, జమీందారీ మీద హక్కు వదులుకుంటాను,'' అన్నాడు.

ఆ సాయంకాలం రామశాస్త్రి ఇంటికి తిరిగివచ్చి, భార్య ఎదటనే సుగ్రీవ శాస్త్రితో, ''ఇవాళ మధ్యాహ్నం నువు చేసిన పనేమిటి? మన బ్రాహ్మణ జమీందారు కుటుంబంవాడు అస్పృశ్యుడిచ్చిన నీరు తాగటమా? ఈ సంగతి తెలిస్తే, నిన్ను కులంలో నుంచి వెలివేస్తారు కూడా. అయినా చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం వుంది కదా? గోమయం తినటం ఆ ప్రాయశ్చిత్తంలో ముఖ్యమైంది. తరవాత కొద్ది రోజులు ఉపవాసం. దివాన్‌జీకి యిందుకవసరం అయిన ఏర్పాట్లు చేయమని చెప్పాను,'' అన్నాడు.

సుగ్రీవశాస్త్రి తండ్రికి జవాబివ్వకుండా మౌనంగా వూరుకున్నాడు. ఆ రాత్రి అతడు తన మిత్రుడైన గుణభట్టును కలుసుకుని జరిగినదంతా చెప్పాడు. గుణభట్టు ఏదో ఒక ఉపాయం ఆలో

చించాలని చెప్పి, అప్పటికప్పుడే పోయి, తనకు పరిచితుడైన మాయాపాలుణ్ణి కలుసుకున్నాడు. ఈ మాయాపాలుడికి ఇంద్రజాల విద్యల్లాంటివి తెలుసు.

మర్నాటి ఉదయం గుణభట్టు, సుగ్రీవశాస్త్రిని చూడవచ్చి, "మిత్రమా, నీకొచ్చిన భయం ఏమీలేదు. ఈ చిక్కు నుంచి బయటపడేందుకు మాయాపాలుడితోపాటు, మా నాన్నగారూ సహాయం చేస్తామన్నారు," అని చెప్పాడు.




సూర్యోదయంతోనే అలవాటు చొప్పున జమీందారు రామశాస్త్రి దేవాలయానికి వెళ్ళాడు. పూజ ముగించి బయటికి వచ్చిన పురోహితుడు భట్టు, అయన్ని చూసి మామూలుగా చిరునవ్వు నవ్వటానికి బదులు, ఏదో దీర్ఘాలోచనలో వున్నవాడిలా కనిపించాడు.

"భట్టుజీ, ఏమిటి అలా వున్నారు?" అని అడిగాడు రామశాస్త్రి ఆశ్చర్యపడుతూ.

భట్టు చిన్నగా నిట్టూర్చి, "అయ్యా, ఒక తీవ్రమైన సమస్య ఎదురైంది. ఇంతకు ముందు నేను ధ్యానంలో వుండగా, పాడి పంటలకు అధిదేవత అయిన అన్నపూర్ణాదేవి కనిపించి, 'భట్టూ, చెప్పులు కుట్టుకుని బతికే రూపరాం నాకు అత్యంత ప్రియమైన భక్తుడు. అతడిచ్చిన నీరు తాగి దాహం తీర్చుకోవటంలో జమీందారు కుమారుడు చేసిన పాపం ఏమీలేదు. రూపరాం నా నిజమైన భక్తుడనేందుకు రుజువుగా, అతడికి ఒక వరం యిస్తున్నాను. అది ఒక్కసారికి మాత్రమే పనికివస్తుంది. రూపరాం ఉడికించకుండానే బియ్యాన్ని, అన్నంగా మార్చగలడు,' అని చెప్పింది," అన్నాడు.

జమీందారు రామశాస్త్రి యివి నమ్మదగిన మాటలు కాదన్నట్టు అడ్డంగా తల తిప్పి, "సరే, భట్టుజీ! ఆ రూపరాంకు పరీక్ష పెట్టి చూద్దాం, ఏపాటి భక్తుడో తేలిపోతుంది." అన్నాడు.

ఒకటి రెండు గంటల తరవాత జమీందారు భవంతికి ముందున్న

ఆవరణలో రూపరాం భక్తి పరీక్షకు ఏర్పాట్లు జరిగాయి. భట్టుజీ ఒక కొమ్ము చెంబు (బైరాగులు, సన్యాసుల వద్ద వుండే కమండలం లాటిది) తెచ్చి, అందరి ఎదటనే దానిని కడిగి, రూపరాంకు యిచ్చే ముందు, చెంబులో నీళ్ళు పోసి, కొన్ని బియ్యపు గింజలు వేశాడు.

రూపరాం కొమ్ముచెంబు తీసుకుని, ఒకసారి దేవాలయం కేసి తిరిగి దణ్ణం పెట్టి, చెంబుకు వున్న కొమ్ములోంచి బలంగా నాలుగైదుసార్లు ఊదాడు. వెంటనే చెంబులోని నీళ్ళ మీద, బాగా ఉడికిన కొన్ని అన్నంమెతుకులు తేలినై.

ఈ అద్భుతం చూసి జమీందారు రామశాస్త్రి నిశ్చేష్టుడయాడు. అయన అక్కడికక్కడే రూపరాంకు రెండెకరాల పొలం దానం చేసి, కొడుకు సుగ్రీవశాస్త్రిని కావిలించుకుని, "సుగ్రీవ్, గట్టిగా కోప్పడినందుకు ఏమీ అనుకోకు," అన్నాడు.

ఆ సాయంత్రం సుగ్రీవశాస్త్రి, గుణభట్టూ కలిసి మాయాపాలుణ్ణి చూడబోయారు. సుగ్రీవశాస్త్రి, మాయాపాలుడికి డబ్బు యివ్వబోగా, అతడు నిరాకరించి, "ఈ ఇంద్రజాలం కిటుకు చెప్పినవాణ్ణి నేను, దాన్ని తెలివిగా అమలుజరిపిన వాళ్ళు భట్టుజీ, రూపరాంలు. నేను చెప్పిన విధంగా భట్టుజీ రహస్యంగా చెంబుకు వున్న కొమ్ముమెలికలో, అన్నం మెతుకులు కొన్ని గట్టిగా దట్టించి, అందరూ చూస్తూండగా చెంబులో నీళ్ళు పోసి కడిగాడు. రూపరాం కొమ్ములో నుంచి గట్టిగా ఊదే సరికి, అక్కడ అంటుకు వున్న అన్నంమెతుకులు, చెంబులోని నీళ్ళలో పడి, పైకి తేలినై. ఈ అద్భుతం జమీందారు రామశాస్త్రి బాబులో పెద్దమార్పు తెచ్చితీరుతుంది." అన్నాడు.

అతడు ఊహించినట్టే, ఆ తరవాత జమీందారు రామశాస్త్రి తన జమీలోని పేదల, అస్పృశ్యుల పట్ల ఎంతో ఉదారంగా ప్రవర్తించుతూ, మంచివాడని పేరు తెచ్చుకున్నాడు.





# పనిలేని వాడు

చంద్రగిరి రాజు భద్రసేనుడికి తన రాజ్యంలో పనిలేనివాళ్ళు ఎందరున్నారో, వాళ్ళు ఏం చేస్తూంటారో తెలుసుకోవాలనిపించింది. వెంటనే ఆయన తన మంత్రిని వెంటబెట్టుకుని మారువేషంలో దేశం పర్యటించడానికి బయలుదేరాడు.

రాజూ, మంత్రీ ఒక పల్లెటూరు చేరుకున్నారు. ఆ ఊళ్ళో పనిలేని వాళ్ళెవరైనా ఉన్నారా అని వాకబు చేయగా సుబ్బయ్య అనే ఆయన ఉన్నాడని తెలిసింది. సుబ్బయ్య వయసులో ఉన్నంతకాలమూ కష్టించి పనిచేసి, బాగా డబ్బు సంపాదించాడు. ఇప్పుడాయనను కొడుకులు చూసుకుంటున్నారు.

భద్రసేనుడు మంత్రితో సహా సుబ్బయ్యను చూడబోయాడు. ఆ సమయానికి సుబ్బయ్య ఇంటి అరుగుమీద కూర్చుని, ధాన్యంగింజలు ఎంచుతున్నాడు.

రాజు ఆశ్చర్యంగా, ''ఏమిటి మీరు చేస్తున్న పని?'' అని అడిగాడు.

సుబ్బయ్య తాను చేసే పని ఆపి, సుద్దముక్కతో నేల మీద అంకె వేసుకుని, ''ఏమిటి, బాబూ, అడిగారు?.... అదా? ఏమీలేదండీ! ఊరికే కూర్చుంటే తోచక, బస్తాలో ధాన్యంగింజలు లెక్క పెడుతున్నాను. బస్తాలు తూకంలో సమంగా ఉంటే, వాటిలో గింజలు కూడా సమంగా ఉంటాయా, ఉండవా అని!'' అన్నాడు.

భద్రసేనుడు నవ్వి, ''మీకు బొత్తిగా పనిలేకనే ఇలాంటి పనికిరాని కాలక్షేపంతో కాలం వృథాపుచ్చుతున్నారనుకుంటాను,'' అన్నాడు.

సుబ్బయ్య కోపంగా, ''రాజవరంలో రంగయ్య కంటే పనిలేనివాణ్ణి కాను నేను!'' అన్నాడు.

---

"వసుంధర"

---



రాజు కుతూహలంతో రాజవరానికి బయలుదేరాడు. రాజూ, మంత్రీ వెళ్ళే సరికి రంగయ్య ఊరి బయట చెరువు వద్ద ఉన్నాడని తెలిసింది. రంగయ్య డబ్బు బాగా సంపాదించాడట. ఇంకా శరీరంలో దార్ఢ్యం ఉన్నా కొడుకులు రంగయ్యను ఏ పనీ చెయ్యనియ్యరట.

భద్రసేనుడూ, మంత్రీ వెళ్ళిన సమయానికి రంగయ్య ఒక చిన్న గరిటెతో చెరువు నుంచి నీరు తెచ్చి, పక్కనే ఉన్న గోతిలో పోస్తున్నాడు.

"ఏమిటి మీరు చేస్తున్న పని?" అని రాజు రంగయ్యను అడిగాడు. రంగయ్య నవ్వి, ఇలా అన్నాడు:

"అబ్బే, ఏమీ లేదండీ! ఊరికే కూర్చునే అలవాటు లేదు. ఈ గరిటెతో ఈ చెరువును ఖాళీచెయ్యాలంటే ఎంత కాలం పట్టుతుందో తెలుసుకుందుకు ప్రయత్నిస్తున్నాను."

"అందువల్ల ఏమిటి ప్రయోజనం?" అన్నాడు రాజు.

"ఎప్పుడైనా క్షామం వచ్చిందనుకోండి, అప్పుడు నీరు పొదుపుగా వాడుకోవలసి ఉంటుంది గదా! పొదుపుగా వాడితే ఈ చెరువులో నీరు ఎంతకాలం వస్తుందో తెలుస్తుంది," అన్నాడు రంగయ్య.

రాజు నవ్వి, "ఎప్పుడో రాబోయే క్షామం మాట దేవుడెరుగు. ప్రస్తుతం మీరు చెరువంతా ఖాళీచేసే ప్రయత్నంలో ఉన్నారు," అన్నాడు వేళాకోళంగా.

"అందుకే గదా, నీళ్ళు వృథా కాకుండా గోతిలో పోస్తున్నాను?" అన్నాడు రంగయ్య.

"ఇలాంటి పనికిరాని పనులతో కాలం వ్యర్థంచెయ్యకపోతే ఏదైనా మంచి పని చేయరాదూ?" అన్నాడు రాజు.

రంగయ్యకు కోపం వచ్చి, "పెదపాడులో ఉండే కామయ్యను చూస్తే మీరేమంటారో?" అన్నాడు.

తక్షణం రాజూ, మంత్రీ పెదపాడు బయలుదేరారు.

పెదపాడు సంపన్నమైన గ్రామం. కామయ్య యువకుడనీ, అతను ఊరి బయట కొండ దగ్గిర ఉన్నాడనీ తెలిసింది. వాళ్ళు అక్కడికి వెళ్ళే సమయానికి కామయ్య ఉత్సాహంగా కొండను తవ్వి, క్కనే ఉన్న లోయలోకి పోస్తున్నాడు.

రాజు అతన్ని పలకరించి, ఏం చేస్తున్నావని అడిగాడు. "కొండను తవ్వి లోయను పూడుస్తున్నాను," అన్నాడు కామయ్య.

"ఎందుకు ?" అని రాజు అడిగాడు.

"ఎందుకేమిటి? నా ఒంట్లో శక్తి ఉన్నది. పోనీ ఊరికి ఉపకారంగా ఉంటుందని ఈ లోయను పూడ్చేస్తున్నాను. పొరుగూళ్ళకు వెళ్ళాలంటే ఈ కొండా, ఈ లోయా కూడా అడ్డంగానే ఉన్నాయి," అన్నాడు కామయ్య.

"ఎంతోమందిని చూశాను గాని, నీ అంత పనిలేనివాణ్ణి చూడలేదు," అన్నాడు రాజు.

"అయితే ఈ దేశపు రాజు సంగతి మీకు తెలియదనుకుంటాను. ఆయనంత పనిలేనివాణ్ణి ఎక్కడా చూడబోరు," అన్నాడు కామయ్య.

కోపంతోపాటు కుతూహలం కూడా పుట్టుకొచ్చింది రాజుకు.

"ఎందువల్ల ?" అని ఆయన అడిగాడు.

"నేను సామాన్యుణ్ణి. ఆయన బరువూ, బాధ్యతాగల రాజు గదా. తన సమయమెంత విలువైనదో గుర్తించడు. వ్యర్థ కలాపాలతో కాలక్షేపం చేస్తూంటాడు. ఒకవేళ ఆయన మా లాటి పనిలేనివాళ్ళను వెతుక్కుంటూ బయలుదేరాడన్నా నేను ఆశ్చర్యపోను!" అన్నాడు కామయ్య.

ఆ మాటలు రాజుకు సూటిగా తగిలాయి. ఆయన తన పర్యటన తక్షణమే ముగించి, రాజధానికి తిరిగి వెళ్ళి, తీరుబడి ఉన్నవాళ్ళు నలుగురికీ ఉపయోగపడే పనులు చేయడానికి అనువైన కార్యక్రమాలు రూపొందించాడు. తన సమయాన్ని కూడా ఆయన మరెన్నడూ వృథా చెయ్యలేదు.





# వ్యర్థప్రయత్నం

రుద్రవర్మ పాలించే దేశంలో ఒక భయంకరమైన ఈతిబాధ పట్టుకున్నది. వానలు సక్రమంగా కురిసేవి. పంటలు చక్కగా పండేవి. కాని చేలు కోతకు సిద్ధంగా ఉన్న తరుణంలో మిడుతల దండ్లు వచ్చిపడి, పంట అంతా ధ్వంసం చేసి పోయేవి. ఈ విధంగా ప్రతి ఏడూ జరుగుతూ వచ్చింది. దాని ఫలితంగా రైతులు అపారంగా నష్టపోయారు. రాజు కూడా నష్టపడ్డాడు. దేశంలో దుర్భిక్షం ఏర్పడింది.

దేశానికి ఈ మిడుతల పీడలేకుండా చేసిన వారికి వారి ఎత్తు బంగారం బహుమానం ఇస్తానని రాజు అన్ని ప్రాంతాలా దండోరా వేయించాడు.

ఆ సమయంలో రాజుకు ఒక వింత విషయం తెలిసింది. ఒక రైతు ప్రతి ఏడూ తన పొలాన్ని మిడుతల బారినుంచి కాపాడుకుని, పూర్తిపంట ఇంటికి తెచ్చుకుంటున్నాడట.

రాజు తన భటులను పంపి, ఆ రైతును పిలిపించాడు. యాభైఏళ్ళ వృద్ధుడు రాజ సభకు వచ్చాడు.

"నీకు మిడుతల బెడద ఏమీ లేదట. మీ పంట క్షేమంగా ఇంటికి చేరుతున్నదట, నిజమేనా?" అని రాజు రైతును అడిగాడు.

నిజమే నన్నాడు రైతు.

"మీ ఒక్కరి పంటా దక్కితే సరా? దేశం సంగతి చూడవద్దా? ఏం ఉపాయంతో మీరు మిడుతల బారినుంచి తప్పించుకుంటున్నారు?" అని రాజు రైతును అడిగాడు.

రైతు సంశయిస్తూ, "మహారాజా, అందుకు చాలా ప్రయత్నం చెయ్యాలి. ఆ ప్రయత్నంలో నమ్మకం ఉంచాలి.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

అందరినీ కూడగట్టటం మా వల్ల అవుతుందా ?'' అన్నాడు రైతు.

''ఎందుకు కాదు? రైతులందరూ కలిసి వచ్చేటట్టు నేను చూస్తాను. మీ కుటుంబంలో వాళ్ళంతా కలిసి ఈ యేడు మిడుతల బెడద లేకుండా చెయ్యండి,'' అన్నాడు రాజు.

రైతు సరేనన్నాడు.

పంటలు బాగా పండినై. కోతల సమయం దగ్గిర పడుతున్నది. ముసలి రైతూ, అతని కుటుంబంవాళ్ళూ కలిసి మిడుతలను నివారించే చర్యలు చేశారు. నగరంచుట్టూ ఉన్న పొలాలలో చిన్న చిన్న రాటలు పాతి, వాటికి రంగు రంగుల జెండాలు కట్టారు. రాత్రివేళ పొలాలలో గట్టిగా పాటలూ, డప్పులమోతలూ వినిపించాయి.

మిడుతలు రాలేదు. పంటలు కోశారు. నూర్పిళ్ళు జరిగాయి. పొలాలనిండా ధాన్యపు రాసులు వెలిశాయి. మిడుతలను రాకుండా చేసే కార్యక్రమంలో నిమగ్నులై ఉండటంచేత రైతుకుటుంబం వాళ్లు తమ పొలం కొయ్యలేదు. ఇతర రైతులైనా వాళ్ళపొలం కోసిపెట్టలేదు. ఎవరి పనుల్లో వారు ఉండిపోయారు.

ముసలిరైతు ఆ రోజే రాజసభకు వెళ్లి, తన బహుమానం గురించి ప్రస్తావించాడు. రాజుగారి ఖజానా నిండుకుని ఉన్నది. ఆయన మనిషి ఎత్తు బంగారం ఎక్కడి నుంచి తెస్తాడు ?



''న్యాయంగా నీ బహుమతి కోసం ప్రజలంతా చందాలు వేసుకోవలిసి ఉంటుంది. ఖజానా నుంచి ఇయ్యటం సాధ్యపడదు. ఈ రోజే నీ బహుమానం సంగతి నలుగురికీ తెలిసేలాగా చాటింపు వేయిస్తున్నాను,'' అన్నాడు రాజు.

ముసలాయన పూర్తిగా నిరాశపడలేదు. ప్రజలు ఈయేడు బాగుపడ్డారు. వాళ్ళు తన పట్ల కృతజ్ఞత చూపకపోరు అనుకున్నాడు ఆయన.

కాని ప్రజలు రాగినాణాలు మించి ఇయ్యలేకపోయారు. వాళ్ళు దరిద్రావస్థలోనే ఉన్నారు.

రుద్రవర్మ ముసలి రైతును పిలిపించి, సంగతి అంతా చెప్పి, ''ఇప్పటికి ఈ రాగి నాణాలతోనే తృప్తిపడాలి మరి! ఏం చేస్తాం. వచ్చే ఏడు ఘనంగా బహుమానం దొరుకుతుందిలే,'' అన్నాడు.

''ఇది ధర్మమా, మహారాజా? మీరే ఆలోచించి చూడండి,'' అన్నాడు రైతు దీనంగా.

''అధర్మం ఏమున్నది? అసలు ఈ యేడు మిడుతల దండు వచ్చినట్టు విననే లేదు. మిడుతల దండును మీ కుటుంబమే ఆపినట్టు రుజువు కూడా లేదు,'' అన్నాడు రుద్రవర్మ.

ముసలాయనకు నడుము విరిగినట్టయింది. ఆయన రాగినాణాల కేసి చూడనైనా చూడకుండా, సభ విడిచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఆకాశమంతా ఒక్క పెట్టున మేఘాలు కమ్మినట్టు అయింది. నక్షత్రాలు కూడా కనిపించలేదు. పెద్ద రొద చేస్తూ గొప్ప మిడుతల దండు వచ్చి పొలాల మీద పడింది. ప్రజలలో హాహాకారాలు చెలరేగాయి.

రుద్రవర్మ ముసలి రైతు కోసం కబురుపంపితే, రైతు సకుటుంబంగా ఎటో వెళ్ళిపోయినట్టు తెలిసింది.

తెల్లవారే సరికి కళ్ళాలలో ఉన్న ధాన్యమంతా నాశనమై పోయింది. తిరిగి దేశం దుర్భిక్షంవాత పడిపోయింది.



# నీవు నేర్పిన విద్యయే!

సుబ్బమ్మ అనే ఆవిడ తన కొడుక్కూ, కూతురికీ ఒకేసారి పెళ్ళిచేసి, కూతుర్ని అత్త వారింటికి పంపి, కోడల్ని తెచ్చుకున్నది. కోడలు వచ్చినా ఇంటిపెత్తనం తనకే ఉంచుకుని, కోడలిని కేవలమూ జీతంలేని పనిమనిషిలా చూడసాగింది.

పండక్కీ, పబ్బానికీ సుబ్బమ్మ కూతురిని పిలుచుకు వచ్చి, ఆమె ఉన్న నాలుగు రోజులూ దగ్గిర కూర్చోబెట్టుకుని, "అస్తమానమూ మీ అత్త చెప్పిన చాకిరీ అల్లా నోరుమూసుకు చేస్తూపోకు, చులకన అయిపోతావు. అప్పుడప్పుడూ కొస్త ఎదురు తిరుగుతూ ఉంటే మీ అత్త కిక్కురు మనకుండా ఉంటుంది. ఇన్నేళ్ళూ నిన్ను పెంచి, వాళ్ళింటికి పంపినది వాళ్ళకు వెట్టిచాకిరీ చేయటానికా? క్రమంగా ఇంటి అజమాయిషీ నీ చేతిలోకి తెచ్చుకున్నావంటే, నీ మొగుడు కూడా నువు గీసిన గిరి దాటకుండా పడిఉంటాడు," అని బోధించేది.

ఈ బోధలు సుబ్బమ్మ కూతురికి ఎంతవరకు ఉపయోగపడ్డాయో గాని, కోడలు మాత్రం వాటిని అప్పుడప్పుడూ విని, అన్నీ ఒంటపట్టించుకున్నది. దాని ఫలితంగా ఆమె సుబ్బమ్మనూ, తన మొగుణ్ణీ గుప్పిట పట్టుకుని ఆడించటం మొదలుపెట్టింది. అంతా స్వయంకృతాపరాధమే నని సుబ్బమ్మ గ్రహించేనరికి, ఆమె హెూదా ఆ ఇంటి పనిమనిషి స్థాయికి చేరుకున్నది.

—గవ్వల నిర్మలాదేవి






లక్నోలో, వాజిద్ అలీషా పాలించే కాలంలో, కలీల్, జలీల్ అని ఇద్దరు స్నేహితులు ఉండేవారు. కలీల్ ఒక గొప్ప వ్యాపారస్థుడి కొడుకు. జలీల్ ఒక గొప్ప పండితుడి కొడుకు. వారు చిన్నతనం నుంచీ కలిసి చదువుకుని, కలిసి ఆడుకుని, పెరిగి పెద్దవారై, ఆదర్శ స్నేహితులుగా పేరుపడ్డారు.

ఒక రాత్రి కలీల్ ఒంటరిగా వజీర్ గారి మహల్ పక్కగా పోతూండగా వీనుల విందుగా ఎవరో ఖురాను చదవటం వినిపించింది. ఆ కంఠం చేత ఆకర్షించబడి కలీల్ దగ్గిరగా వెళ్ళి, ఖురాను పఠనం రెండో అంతస్థు నుంచి వినవస్తున్నట్టు తెలుసుకున్నాడు. కలీల్ సమ్మోహితుడై, పూలతీగల సహాయంతో రెండవ అంతస్థుకు ఎక్కేసరికి, అక్కడ వజీరు ఏకపుత్రికా, అందాలరాశీ అయిన షబానా ఒంటరిగా ఖురాను పఠనంలో లీనమై ఉండటం కనిపించింది.

కలీల్ వెనక్కు తిరిగి వచ్చే ఉద్దేశంలో ఉండగా షబానా తప్పు చదివింది. కలీల్ వెంటనే ఆ తప్పును సరిదిద్దాడు. షబానా తన పఠనంలో పూర్తిగా నిమగ్నురాలై ఉండటం చేత తన తప్పు దిద్దుకున్నది గాని, తలఎత్తి చూడలేదు.

కలీల్ ఆమెకు కొంత దూరంలో కూర్చుని, ఆమె తప్పు చదివినప్పుడల్లా సరిచేశాడు. షబానా తన తప్పులు దిద్దుకున్నదిగాని తలఎత్తి చూడనేలేదు. ఆమె ఖురాను చదువుతున్నంత సేపూ కలీల్ అక్కడే కూర్చుని, ఆమె పఠనం ముగించి, దువా (ప్రార్థన) ప్రారంభించగానే, లేచి వచ్చేశాడు. అప్పుడు కూడా షబానా తన తప్పులు దిద్దిన వాళ్ళు ఎవరైనదీ గమనించలేదు.

అన్వర్

మర్నాడు రాత్రి కూడా కలీల్ వజీరు మహల్ కేసి వెళ్ళాడు. కిందటి రోజులాగే షబానా ఖురాను చదువుతున్నది. కలీల్ మళ్ళీ పై అంతస్థుకు ఎక్కి, దూరంగా కూర్చుని షబానా తప్పులు సరి చేసి, తిరిగి వచ్చాడు.

ఇలా రోజూ జరుగుతూ వచ్చింది. ఒకనాడు, కలీల్ తీగల సహాయంతో పైకి ఎక్కరావటం వజీరు కంటపడింది. ఆయనకు చాలా కోపం వచ్చింది. ఆయన పైకి వెళ్ళి, గుమ్మం దగ్గిర పరదా వెనక దాగి, జరిగినదంతా గమనించి చాలా ఆశ్చర్యపడ్డాడు. షబానా కలీల్ అక్కడ ఉన్న సంగతి కూడా ఎరగదని ఆయనకు స్పష్టమయింది.

అటుతరవాత వారం రోజుల పాటు వజీరు తన కుమార్తెనూ, కలీల్‌నూ గమనించాడు. వారి కార్యక్రమంలో మార్పు ఏమీలేదు.

ఈ వింత సంఘటన గురించి ఏం చెయ్యాలో వజీరుకు పాలుపోలేదు. ఆయన తగిన సమయం చూసి, పాదుషాకు జరిగినదంతా చెప్పాడు. అంతా విని పాదుషా మొదట ఆశ్చర్యపడి, తరవాత చిరునవ్వు నవ్వి, వజీరు చెవిలో ఏదో చెప్పాడు.

ఆ రాత్రి షబానా గది నుంచి దిగి వస్తున్న కలీల్‌ను ఇద్దరు సిపాయిలు పట్టుకుని, ''ఎందుకు పైకి పోయినావు?'' అని అడిగారు.



వజీరు కుమార్తె మర్యాద కాపాడటం కోసం కలీల్, వాళ్ళతో, "దొంగతనానికి!" అని చెప్పాడు.

"చూడటానికి మర్యాదస్తుడిలా గున్నావు. నువు దొంగవన్నమాట. ఎవరైనా జామీను ఇస్తే ఈ రాత్రికి నిన్ను వదిలేస్తాము. నువు రేపు ఉదయం పాదుషా సమక్షాన హాజరుకావాలి," అన్నారు సిపాయిలు.

గత్యంతరం లేక కలీల్ తన తండ్రి దగ్గిరికి వెళ్ళి, జామీను ఉండమన్నాడు. కొడుకే అయేదిగాక, దొంగకు జామీను ఉండనన్నాడు కలీల్ తండ్రి. అప్పుడు కలీల్ తన స్నేహితుడైన జలీల్ వద్దకు వెళ్ళి, సంగతి చెప్పి, అతన్ని జామీను ఉండమన్నాడు. జలీల్ ఒప్పుకున్నాడు. సిపాయిలు జలీల్‌కు కలీల్‌ను అప్పజెప్పి, వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం కలీల్‌ను పాదుషా వద్దకు తీసుకుపోవటానికి పాదుషా పంపిన సిపాయిలు వచ్చారు.

"నిన్నరాత్రి పట్టుబడిన దొంగను నేనే, నన్ను పట్టుకుపొండి," అన్నాడు జలీల్ సిపాయిలతో.

"అసలు దొంగను నేను. ఇతను నాకు జామీను ఇచ్చిన మిత్రుడు," అన్నాడు కలీల్.

ఎవరిని పట్టుకుపోవాలో తోచక సిపాయిలు ఇద్దరినీ పాదుషా వద్దకు పట్టుకుపోయారు. ఇద్దరూ పాదుషా దగ్గిర, నేను దొంగనంటె నేను దొంగనని చెప్పసాగారు.

చివరకు పాదుషా వారితో, "మీ రిద్దరూ దొంగలే. మీ ఇద్దరికీ శిక్షవిధిస్తున్నాను. కలీల్ వజీరు కూతురు షబానాను పెళ్ళాడాలి. జలీల్ మా ఆస్థానంలో పండితుడుగా పని చెయ్యాలి. ఇవే మీకు తగిన శిక్షలు," అన్నాడు.

తరవాత పాదుషా జరిగినదంతా సభికులకు చెప్పాడు. అందరూ పాదుషా ఉదారతను ఎంతగానో మెచ్చుకున్నారు. కలీల్‌కూ, షబానాకూ వైభవంగా వివాహం జరిగింది.





# వీర హనుమాన్

రావణుడు అశోకవనంలో ఉన్న సీతను చూడబోయేసరికి, ఆమె భయంకర రాక్షస స్త్రీల నడుమ, తల వంచి కన్నీరు కార్చుతూ, రాముణ్ణి గురించే ఆలోచిస్తూ కూర్చుని ఉన్నది.

ఎంతో మంచి శుభవార్త తెచ్చిన వాడిలాగా అభినయిస్తూ, రావణుడు ఉత్సాహంగా సీతతో, "అయిపోయిండి! నీ రాముడు యుద్ధంలో చచ్చిపోయాడు. ఇక నువు నా భార్యవు కావటానికి ఎలాటి అడ్డంకి లేదు. నా భార్య లందరి మీదా నిన్ను పెద్ద భార్యను చేస్తాను. రాముడు ఎలా చచ్చాడో చెబుతాను విను. రాముడు వానర సేనతో సముద్రాన్ని దాటి, విడిశాడు. ప్రయాణపు బడలిక చేత అందరూ గాఢ నిద్రలో ఉండగా, ప్రహస్తుడు పెద్ద రాక్షస సేనతో వెళ్ళి వానర సేనను నాశనం చేశాడు. రాముడు నిద్రపోతూండగా ప్రహస్తుడే అతని తలను నరికాడు. పారిపోదామని ఆకాశంలోకి ఎగిరిన విభీషణుణ్ణి రాక్షసులు పట్టుకున్నారు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ పరిగెత్తారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, మిగిలిన వానర వీరులూ తలలు తెగి చచ్చిపడి ఉన్నారు. వానరుల శవాలు అంతటా కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి," అన్నాడు.

తరవాత అతను ఒక రాక్షసితో, "రాముడి తల తీసుకు వచ్చిన

22. లంకానగర ముట్టడి



ఇక్కడికి తెచ్చాడు. ఇక నీకు నేను తప్ప గతి లేదు," అన్నాడు.

సీత ఆ రాముడి తలను పరీక్షగా చూసి, కళ్ళూ, తల వెంట్రుకలూ, తల మీది చూడామణీ గుర్తుపట్టి గట్టిగా ఏడుస్తూ, కైకను తిట్టిపోసింది. తరవాత ఆమె స్పృహతప్పి పడిపోయింది. తిరిగి స్పృహరాగానే ఆమె రాముడి తల దగ్గిరికి తీసుకుని, అతని కోసం చాలాసేపు ఏడ్చింది. రాముడి చావు గురించి కౌసల్య లక్ష్మణుడి ద్వారా విని, గుండె పగిలి చచ్చిపోతుంది. రాముడి వంశమంతా నాశనమైపోతుంది. ఇదంతా తన మూలాన జరుగుతుందని తెలియక రాముడు తనని పెళ్ళాడాడు.

ఆమె రావణుడితో, "నన్ను తీసుకుపోయి ఆ రాముడి మీద పడవేసి, భార్యాభర్తలను ఏకం చేసిన పుణ్యం కట్టుకో. నేను రాముడితో సహగమనం చేస్తాను," అంటూ ఏడ్చింది.

ఆమె అలా ఏడుస్తూండగా ఒక రాక్షసుడు వచ్చి, రావణుడికి నమస్కరించి, సేనాపతి అయిన ప్రహస్తుడు వచ్చి ఉన్నాడని చెప్పాడు. అతని వెంట మంత్రులందరూ ఉన్నారట. ఆ మాట వింటూనే రావణుడు బయలుదేరి తన మంత్రులను చూడబోయాడు. అతను

విద్యుజ్జిహ్వుణ్ణి పిలుచుకురా!" అని సీత వినేలాగా అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలనూ, విల్లునూ తీసుకు వచ్చి, రావణుడికి నమస్కరించి నిలబడ్డాడు. రావణుడు వాడితో, "ఆ రాముడి తల సీత ముందు ఉంచు. ఈ నిర్భాగ్యురాలు తన భర్త గతి చివరకు ఎలాగయిందో చూసుకోనీ," అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలను సీత ముందు పెట్టి అవతలికి వెళ్ళాడు. వాడి చేతి నుంచి రావణుడు విల్లు తీసుకుని, సీతతో "ప్రహస్తుడు నిద్రపోతున్న రాముడి తల నరికిన అనంతరం ఈ విల్లు

అశోకవనం చాటగానే రాముడి తలా, విల్లూ అంతర్థానమయాయి.

ఇంతలో విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చింది. సరమ చాలా మంచిది. ఆమె సీత పట్ల చాలా స్నేహంగా ఉండేది. ఆమె సీతను ఊరడిస్తూ, "రావణుడి భయాన్ని కూడా లక్ష్యపెట్టకుండా చాటున ఉండి, నీకూ, రావణుడికీ జరిగిన సంభాషణ అంతా విన్నాను. రావణుడు అకస్మాత్తుగా ఎందుకు వెళ్ళాడో తెలుసా? ఆ భేరీల మోత విన్నావా? సైనికులను సన్నద్ధం చేస్తున్నారు. యుద్ధానికి ఏనుగులనూ, గుర్రాలనూ సిద్ధం చేస్తున్నారు. రావణుడు రాముడితో యుద్ధానికి తయారవుతున్నాడు. రామలక్ష్మణులు రాక్షసుల నందరిని చంపి, నీ కష్టాలు గట్టెక్కిస్తారు," అన్నది.

ఈ మాటలకు సీత ఆవేదన కొంత చల్లబడింది.

సరమ సీతతో ఇంకా ఇలా చెప్పింది:

"నేను ఆకాశమార్గాన రాముడి వద్దకు వెళ్ళి, నువు క్షేమంగా ఉన్నావని చెప్పి రావాలనుకుంటున్నాను. నేను ఆకాశంలో గరుత్మంతుడి కన్న వేగంగా పోగలను, తెలుసా?"

"నువు ఆకాశంలో పోగలవన్నా, పాతాళానికిపోగలవన్నా నేను నమ్మగలను.



నా కోరిక తీర్చదలుచుకుంటే ఇప్పుడు రావణుడు ఏంచేస్తున్నాడో తెలుసుకునిరా. నాకు రావణుడి భయమే హెచ్చుగా ఉన్నది. రావణుడు ఏంచెయ్యబోతున్నాడో చెబితే నేను నీకు కృతజ్ఞురాలుగా ఉంటాను," అని సీత అన్నది.

సరమ సీత ముఖాన కన్నీరు తుడిచి, వెంటనే వెళ్ళి, రావణుడు తన మంత్రులతో మాట్లాడేదంతా విని, తిరిగి వచ్చి, సీతతో ఇలా చెప్పింది:

"నిన్ను విడిచెయ్యమని రావణుడికి అతని తల్లీ, అవిద్ధు అనే ముసలి మంత్రి ఎంతో దూరం బోధించారు. లేకపోతే అపాయం ఉన్నదని కూడా వాళ్ళు



హెచ్చరించారు. కాని వాళ్లు ఎంత చెప్పినా రావణుడు వినలేదు. యుద్ధంలో చచ్చే దాకా రావణుడు నిన్ను విడవడు. అతని మంత్రులు కూడా అతన్ని బలపరుస్తున్నారు."

సరమ మాట్లాడుతూండగానే వానర సైన్యాలు చేసే భేరీనాదాలూ, శంఖ నాదాలూ, సింహనాదాలూ భూమి దద్దరిల్లే లాగా వినిపించాయి. రాముడు లంకా నగరం మీదికి బయలుదేరాడు.

రావణుడు వానరసేనల కోలాహలం విని, సభలో తన మంత్రులతో, "మీరు లోగడ హనుమంతుడు సముద్రాన్ని దాటటం గురించి, రాముడి సేనను గురించి గొప్పగా చెప్పారు. విన్నాను. ఇప్పుడు రాముడి పరాక్రమం తలచుకుని, నిరుత్సాహపడి, ఒకరి మొహాలు ఒకరు చూడటం కూడా కనిపిస్తూనే ఉన్నది." అన్నాడు.

ఈమాట విని మాల్యవంతు డనే రాక్షసుడు, "రాజా, రాముడు మన కన్న బలవంతుడైనప్పుడు అతనితో సంధి చేసుకోవటం తప్పుకాదు. రాముడికీ, మనకూ వైరకారణం సీత. ఆమెను రాముడికి ఇచ్చేస్తే వైరంలేదు," అన్నాడు. రావణుడికి కోతుల వల్లా, కొండముచ్చులవల్లా, భల్లూకాల వల్లా చావులేకుండా వరం లేదన్న సంగతి కూడా మాల్యవంతుడు జ్ఞాపకం చేశాడు.

మాల్యవంతుడి మాట రావణుడికి కొంచెం కూడా రుచించ లేదు. అతను మాల్యవంతుడి కేసి తీక్ష్ణంగా చూసి, "హితం చెప్పుతున్నట్టు నటిస్తూ, కటువైన మోసపు మాటలు ఎందుకు చెప్పావు? రాముడు మామూలు మనిషి; ఒంటరిగాడు; తండ్రి చేత విడవబడిన వాడు; కోతులు సహాయంగా గలవాడు; అడవులు పట్టి తిరుగుతున్నవాడు. అలాటివాడు సమర్థుడని ఎలా చెప్పావు? సమస్త రాకసులకూ ప్రభువును; సమస్త దేవతలనూ హడలగొట్టిన పరాక్రమశాలిని.

నేను అతనికి ఎందుకు తీసిపోయాను? నీ జాతిలోనే మహావీరుడు ఉండటం సహించలేకనే, లేక శత్రుపక్షపాతంతోనే నువు అలా మాట్లాడి ఉంటావు గాని, మరో కారణం లేదు. నేను సీతను అరణ్యం నుంచి తెచ్చింది తిరిగి ఇచ్చెయ్యటానికా? నే రాముడితో యుద్ధానికి భయపడటమా? రాముడు అంత బలవంతుడైతే నా తల తీయనీ, కాని తల వంచటం నా స్వభావం కాదు," అన్నాడు.



రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి మాల్యవంతుడు మౌనం వహించాడు. అతను విజయం కలగాలని రావణుణ్ణి దీవించి వెళ్ళిపోయాక, రావణుడు మంత్రులతో రక్షణచర్యలు చర్చించాడు.

లంకా నగరపు పడమటి ద్వారాన ఇంద్రజిత్తూ, ఉత్తర ద్వారాన శుకసారణులూ, మధ్యలో విరూపాక్షుడూ రాక్షససైనికులతో సహా ఉండేటట్టు నిర్ణయించి, మంత్రుల చేత "జయ, జయ!" అనిపించుకుని రావణుడు అంతఃపురానికి వెళ్ళాడు.

రాముడు వానర ప్రముఖులందరితో లంకానగరం చేరాక, వారిలో వారు ఇలా అనుకున్నారు:

"ఇదుగో, లంకానగరం. దీన్ని జయించటం దేవతలకు కూడా సాధ్యం కాదు. అందుచేత మనం ఇప్పుడు ఏం చెయ్యాలి?"

విభీషణుడు వారితో, "నా మంత్రులు లంకకు పక్షుల రూపంలో వెళ్ళి అక్కడి ఏర్పాట్లన్నీ చూసి వచ్చారు. ప్రహస్తుడు సేనతో తూర్పు ద్వారాన్నీ, మహోదర, మహాపార్శ్వులు దక్షిణ ద్వారాన్నీ కాస్తున్నారు. ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారాన్నీ, విరూపాక్షుడు నగర మధ్యాన్నీ కాస్తున్నారు," అని చెప్పాడు.

అతని మంత్రులు కూడా రాముడికి తాము చూసి వచ్చిన వివరాలు చెప్పారు.

తరవాత రాముడికి హెచ్చరికగా ఉండగలందులకు విభీషణుడు, రావణుడి



వెంట అతనితో సమాన బలపరాక్రమాలు గల రాక్షసులు అరవై లక్షల మంది ఉన్నారని చెప్పాడు. తన వీరులు ఎవరు ఎవరితో యుద్ధం చెయ్యాలో రాముడు చెప్పాడు.

నలుడు తూర్పుద్వారం వద్ద ఉన్న ప్రహస్తుడితోనూ, అంగదుడు దక్షిణద్వారం వద్ద ఉన్న మహాపార్శ్వ, మహోదరులతోనూ, హనుమంతుడు పడమటి ద్వారం దగ్గిరా, ఉత్తరద్వారం వద్ద ఉన్న రావణుడితో రాముడూ యుద్ధం చెయ్యాలి. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉంటాడు. సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూ మధ్యసేనతో యుద్ధం చేస్తారు. యుద్ధమప్పుడు వానరులు మనుష్యరూపాలు ధరించరాదు. అలా అయితే గాని ఎవరు "మన" వాళ్ళో తెలియదు. రామ, లక్ష్మణులూ, హనుమంతుడూ, సుగ్రీవుడూ, నీలుడూ, అంగదుడూ, విభీషణుడూ మాత్రమే మనుష్యరూపాలతో యుద్ధం చేస్తారు.

ఇలా నిర్ణయించిన అనంతరం రాముడు లక్ష్మణుడితో సహా, మహా అందమైన సువేలపర్వతం ఎక్కాడు. అతని వెంట విభీషణుడు మొదలైన వాళ్ళు కూడా ఎక్కి, ఆ రాత్రి అక్కడ గడప నిశ్చయించారు. సువేలపర్వత శిఖరం మీది నుంచి చూస్తే, త్రికూట పర్వతం మీద నిర్మించిన లంకానగరం కనబడుతుంది. రాముడు మొదలైన వాళ్ళు లంకానగరాన్నేగాక, అందులో ఉన్న రాక్షసులను కూడా చూశారు. వానరులు సింహనాదాలు చేశారు.

ఇంతలో సూర్యుడు అస్తమించాడు. అందరూ ఆ రాత్రి సువేలపర్వత శిఖరం మీదనే గడిపారు. మర్నాడు తెల్లవారగానే వారికి లంకలోని వనాలూ, ఉపవనాలూ ఎంతో అందంగా కనిపించాయి. లంకకు అంతటికీ ఎత్తయినది రావణుడి ఇల్లు. దాని చుట్టూ ఎత్తయిన చైత్యప్రాసాదం ఉన్నది.

అంతలో సుగ్రీవుడికి రావణుడు కని పించాడు. సుగ్రీవుడు అతనితో, "రావ ణుడా, నేను రాముడి స్నేహితుణ్ణి; బంటును. నేను నిన్ను విడిచిపెట్టను." అన్నాడు.

"నీ పేరు మంచి కంఠంగలవాడు. కాని నీకు అసలు కంఠమే లేకుండా చేస్తాను." అంటూ రావణుడు సుగ్రీవుడి మీదికి లంఘించాడు. ఇద్దరూ భయం కరంగా పోట్లాడుకున్నారు.

చాలా సేపు ఇద్దరూ సమంగానే పోరాడారుగాని, క్రమంగా రావణుడికి ఆయాసం వచ్చి, అతను మాయలకు దిగాడు. అది గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను తిరిగి వస్తాడని రావణుడు అనుకున్నాడు గాని, సుగ్రీవుడు వెళ్లి, రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి మందలిస్తూ, "నాతో చెప్పకుండా ఎందుకిలా చేశావు? రాజులు సాహసాలు చెయ్యరాదు. నీకు ఏమయిపోతుందోనని మేమంతా భయ పడ్డాం. నీకు అపాయం కలిగి ఉంటే మా గతి ఏమై ఉండేది? రావణుణ్ణి బంధువులతో సహా చంపి, విభీషణుడికి పట్టంగట్టి అయోధ్యకు తిరిగి పోవాలన్నది నా సంకల్పం." అన్నాడు.

"రాముడా, సీతను ఎత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు కనబడితే ఎలా సహిం ఊరుకోను?" అన్నాడు సుగ్రీవుడు.

అందరూ పర్వతం దిగి వచ్చారు. రాముడు లంక మీదికి యుద్ధానికి పోవ టానికి తొందరపడ్డాడు. అతని వెనకగా విభీషణుడూ, సుగ్రీవుడూ, హనుమం తుడూ, జాంబవంతుడూ, నలుడూ, సుసేణుడూ, నీలుడూ, లక్ష్మణుడూ నడి చారు. వారి వెనక మహాసముద్రం లాటి వానరసేన కదిలింది.

రామలక్ష్మణులు లంకానగరపు ఉత్తర ద్వారాన్ని ముట్టడించారు. దాన్ని రావ ణుడు స్వయంగా రక్షిస్తున్నాడు. అక్కడ అంతులేని రాక్షసఆయుధాలూ, కవచాలూ ఉన్నాయి.






యథా పుష్కరపర్ణేషు
పతితా స్తోయబిందవః
నశ్లేష ముపగచ్ఛంతి,
తథా నార్యేషు సంగతం. 1

[తామరాకు పైన నీటిచుక్కలు ఎలా ఒకదానితో ఒకటి చేరవో, అలాగే ఉంటుంది దుష్టులతో చేరిక.]

యథా పూర్వం గజ స్స్నాత్వా
గృహ్య హస్తేన వై రజః
దూషయ త్యాత్మనో దేహం,
తథా నార్యేషు సంగతం. 2

[ఏనుగు ఎలాగైతే మొదట శుభ్రంగా స్నానం చేసి, వెంటనే తొండంతో దుమ్ము ఎత్తి వంటి నిండా చల్లుకుంటుందో, అలా ఉంటుంది దుష్టులతో చేరిక.]

యథా శరది మేఘానాం
సించతా మపి గర్జతాం,
న భవ త్యంబుసంక్లేదః,
తథా నార్యేషు సౌహృదం. 3

[ఎలాగైతే శరత్కాల మేఘాలు కురిసేలాగా గర్జించినా, భూమి ఏమీ తడవదో, అలా ఉంటుంది దుష్టుల స్నేహం.]

దుష్టుల స్నేహం

Photo by Pranlal K. Patel



బహుమతి పొందిన వ్యాఖ్య

వానకి గొడుగే

పంపినవారు :
వి. ఎన్. శర్మ

Photo by M. Viswanath



గాంధీచౌక్,
ఖమ్మం.

ఎండకి గొడుగే

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూలై 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డు పైన మాత్రమే రాయాలి. అడ్రను: ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ. మద్రాసు–26

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3. Arcot Road. Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

62

# ఇంట్లో కూర్చొని తెప్పించుకోండి






3 బాండ్ల శక్తివంతమైన
'ఘుంఘురూ' All world ట్రాన్సిస్టర్
వెల 130 రూపాయలు.



'వికాస్' ఫొటోగ్రాఫీ కెమెరా
వెల 55 రూపాయలు.



మీడియంవేవ్ పాకెట్ ట్రాన్సిస్టర్
వెల 60 రూపాయలు.



మైలట్ 4 బాండ్ల All world
శక్తివంతమైన ట్రాన్సిస్టర్
వెల 150 రూపాయలు.

నచ్చని ఎడల డబ్బు వాపసు. మీ ఆర్డర్లు ఇంగ్లీషులో లేదా హిందీలో పంపండి. ప్రతి పట్టణాలో గ్రామంలో ఏజంట్లు కావాలి

**SUPREME TRADERS (Regd.) 41, Old Lajpat Rai Market, Delhi-6**

---

# use NURIT

*ink to impress*




న్యూరిట్ వివిధ
రంగు యింకులతో
సులలితంగా వ్రాయండి
—అంతర్జాతీయ స్టాండర్డ్సు
మేరకు తయారుచేసిన
మేలిమి రకం యింకులు—
ప్రస్తుతం పగిలిపోనట్టి
ప్లాస్టిక్ కంటైనర్లయందు
లభించగలవు

**న్యూరిట్ ఇంక్స్ ప్రైవేట్ లిడ్.**
మద్రాస్-600004

ARIES/NI:466T

62



పసివాళ్ళ పాదాలు నిరాటంకంగా
మంచి ఆకృతిలోకి పెరగాలనే
ముఖ్యోద్దేశంతోనే బాటా
నిపుణులు దృఢమయిన
పలురకముల జోళ్ళని
రూపొందించేరు.



# ప్రథమ విభాగం మొదలయ్యేది బాటా తోనే

వేఫైండర్స్ 17
సైజులు 9-11,
12-1,2-6
రూ. 24.95,
28.95, 32-95

మిలి 24
సైజులు 5-10
రూ. 14-95

కామెట్ 73
సైజులు 9-11½
12-1½, 2-5
రూ. 23-95
26.95, 30.95

వేఫైండర్స్ 53
సైజులు 9-11
12-1, 2-5
రూ. 24.95
28.95, 34.95

లేత పాదాల ఆరోగ్యకరమైన
పెరుగుదలకి తీర్చి దిద్దేది

**Bata**

ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్

# సీతా కల్యాణం

ఈస్ట్‌మన్ కలర్



రచన: ముళ్ళపూడి వెంకటరమణ సంగీతం: కె.వి.మహదేవన్ కెమెరా: కె.ఎస్.ప్రసాద్

స్పెషల్ ఎఫెక్ట్స్: రవికాంత్ నగాయిచ్ కళ: కుదరవల్లి నాగేశ్వరరావు ఎడిటింగ్: కందస్వామి

దర్శకత్వం: **బాపు** నిర్మాత: **పింజల ఆనందరావు**

ANNAPURNA అన్నపూర్ణ

VENKATESWARLU

